# ఆంధ్రపత్రిక



THE ANDHRA PATRIKA - MADRAS. సంపుటం 42. సంచిక 159 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO గురువారం 8-9-1955 Reg. No. M. 1118 6 పేజీలు 1 అణా.

# తెలంగాణా రాష్ట్రం ఏర్పడి విశాలాంధ్ర నిర్మాణంపై నిర్ణయం చేస్తుంది

## జాతీయ ఎన్నికలలోగా జరుగనున్నదని శ్రీ గోపాలరెడ్డి వెల్లడి

## రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం సూచించనున్న ఏర్పాట్లు

### హైదరాబాదు కన్నడ ప్రాంతం మైసూరులోను మరాట్వాడాను బొంబాయిలోనూ కలిపివేస్తారట

సికింద్రాబాదు, సెప్టెంబరు 6: "హైదరాబాదు రాష్ట్రం విచ్ఛిన్నం అయిపోతుంది. ఈ రాబోయే జాతీయ ఎన్నికలవరకూ తెలంగాణా జిల్లాలు, హైదరాబాదు రాజధానిగా, హైదరాబాదు రాష్ట్రంగా వ్యవహరింపబడతాయి. కర్నాటకజిల్లాలను మైసూరులో చేర్చివేసి ఐక్యకర్నాటక రాష్ట్రం ఏర్పరుస్తారు. మరాట్వాడాజిల్లాలను బొంబాయి రాష్ట్రంలో కలిపివేస్తారు. రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘం ఈ విధంగా సూచించబోతున్నట్లు నాకు ఢిల్లీలో గట్టిగా తెలిసింది" అని ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి అన్నారు.

ఈ సారి ఎన్నికల తర్వాత ఏర్పడే తెలంగాణా రాష్ట్ర శాసనసభకు ఆ రాష్ట్రం అట్లా వేరే వుండాలా లేక ఆంధ్రరాష్ట్రంతో చేరిపోవాలా అన్నది నిర్ణయించుకొనే అవకాశం వుంటుందని కూడా తమకు తెలిసిందని శ్రీ గోపాలరెడ్డి అన్నారు.

శ్రీ గోపాలరెడ్డి ఇవ్వాళే ఢిల్లీనుంచి వచ్చారు. ఈ సాయంత్రం నిజాం కళాశాల ఆంధ్ర సారస్వతసమితి ప్రధానోపన్యాసం చేశారు. కళాశాల ప్రాంగణంలో ప్రధానాచార్యుడు డాక్టర్ సయ్యద్ హుస్సేన్, సారస్వతసమితి కార్యవర్గం శ్రీ రెడ్డికి స్వాగతమిచ్చారు.

శ్రీ రెడ్డి ఇట్లా ప్రసంగించారు: రాష్ట్ర పునర్వ్యవస్థీకరణసంఘం నివేదిక రెండుమూడువారాలలో బయట పడుతుంది. సెప్టెంబరు 30 వ తేదీకల్లా వచ్చేస్తుంది. వారేమి సిఫార్సు చేయబోతున్నారో ఎవరికీ అధికారికంగా తెలియదు. కాని నేను తెలుసుకొన్నదానిని బట్టి, వారు దేశంలోని రాష్ట్రాలసంఖ్యను 15 లేక 16 కి తగ్గించబోతున్నారు. చిన్న చిన్న రాష్ట్రాలు వుండవు.

వారి సిఫార్సులు ఏవైనప్పటికీ, ఎట్లా వున్నప్పటికీ ప్రజలు అంగీకరించటం మంచిది. బాగావుంటుంది. అవి కొందరికి హితంగా వుండవచ్చు, మరికొందరికి అహితంగా వుండవచ్చు. అందరికీ తృప్తికలిగేటట్లు సిఫార్సులు చేయటం సాధ్యమా? కనుక దేశహితం ప్రధానంగా, పరిపాలనాసౌకర్యందృష్టిలో పెట్టు

(3 వ పేజీ చూడుడు

### సింహళం ప్రధానికి నెహ్రూ వ్రాసిన లేఖ

కొలంబో, సెప్టెంబరు 6: భారత ప్రధాన మంత్రి శ్రీ జవహర్ లాల్ నెహ్రూ తమకు వ్రాసిన ఉత్తరంలోని వివరాలను పార్లమెంటులో వెల్లడిచేయడానికి సింహళం ప్రధాని సర్ జాన్ కొటెలావాలా నిరాకరించారు. "ఆ ఉత్తరాన్ని పరిశీలిస్తున్నాము. అందువల్ల దానిని బయట పెట్టే వీలులేదు" అని సభ్యుల ప్రశ్నలకు సమాధానం ఇచ్చారు.

## రాష్ట్రపతిచే నెహ్రూకు 'భారతరత్న' ప్రదానం

### ఇంజనీర్లకు సంఘసేవకులకు శిల్పులకు విద్యావేత్తలకు మన్నన

### ఆంధ్ర పితామహునికి 'పద్మభూషణ్'

న్యూఢిల్లీ, సెప్టెం 7: భారత జాతికి చేస్తున్న నిరంతర సేవకు, ప్రపంచ ప్రజల శాంతిసౌభాగ్యాలకోసం ఆయన చేస్తున్న నిరోచితకృషికి ప్రశంసాపూర్వకంగా ప్రధానమంత్రి శ్రీ జవహర్ లాల్ నెహ్రూకు "భారత రత్న" బిరుదును రాష్ట్రపతి నేడు బహూకరిస్తారు.

#### భారతరత్న

కాశీనగరవాసి విద్యావేత్త అయిన డాక్టరు భగవాన్ దాస్ కు, ప్రముఖ ఇంజనీరు పారిశ్రామికవేత్త రాజనీతిజ్ఞుడు అయిన శ్రీ యమ్. విశ్వేశ్వరయ్యకు కూడా "భారత రత్న" బిరుదును బహూకరించారు.

విద్య, సంస్కృతి, సమాజ సేవా రంగాలలో అత్యంత కృషి చేసిన "ఆంధ్రపితామహ" శ్రీ మాడపాటి హనుమంతరావుకు "పద్మభూషణ్" బిరుదు నిచ్చారు.

"పద్మవిభూషణ్" బిరుదు యీ క్రిందివారికి బహూకరించారు:— డా॥ డి. కె. కార్వే, శ్రీ జె. ఆర్. డి. టాటా డాక్టర్ కార్వే ప్రముఖ సంఘ సేవకుడు, విద్యావేత్త, మహిళల విద్యాభివృద్ధికి మార్గదర్శకుడు, శ్రీ టాటా, ప్రముఖ పారిశ్రామికవేత్త, పారిశ్రామిక రంగంలోనూ, పౌర విమానయాన రంగంలోనూ అపూర్వమైన అభివృద్ధిని సాధించడానికి ఆయన ప్రశంసనీయమైన కృషి చేశారు.

శ్రీ మాడపాటి హనుమంతరావుగారు.

#### పద్మభూషణ్

"పద్మభూషణ్" బిరుదును పొందిన వారిలో ఇద్దరు ప్రముఖ విద్యావేత్తలు పశ్చిమ బెంగాలు లెజిస్లేటివ్ కౌన్సిలు అధ్యక్షుడు, డాక్టర్ యస్. కె. ఛటర్జీ ఒకరు, ఆయన ప్రముఖ భాషాతత్వశాస్త్రజ్ఞుడు, సంస్కృతీపరుడు, అనేక ఉన్నత విద్యా సంస్థలతో సంబంధమున్నవాడు. రెండవవారు ఉత్కల్ విశ్వవిద్యాలయం అధ్యక్షుడు డాక్టర్ పి. కె. పరీజా, వీరు సుప్రసిద్ధ విద్యావేత్తలు. వివిధ రంగాలలో మహనీయమైన సేవ చేసినవారు, ఈ బిరుదును పొందిన వారిలో ముగ్గురు ఇంజనీర్లు కూడా వున్నారు. ప్రముఖ రైల్వే ఇంజనీరు శ్రీ ఖరేఘట్ భీవ్యాస్ ఒకరు. నౌకలను, వాకులను, వంతెనలను, కాలువలను, రైల్వేలను నిర్మించడంలో ఆయనకు విశేష ప్రజ్ఞానుభవాలున్నాయి. రైల్వేబోర్డు అధ్యక్ష పదవి నుంచి

(4 వ పేజీ చూడుడు)

ప్రముఖ ఇంజనీరు, రాజనీతిజ్ఞుడు, పారిశ్రామికవేత్త అయిన మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారికి సెప్టెంబరు 7-వ తేదీన రాష్ట్రపతి 'భారత రత్న' బిరుదు ప్రదానం చేశారు.

కాశ్మీరు ప్రధాని శ్రీ గులాం మహమ్మద్ ఈనెల 4 వ తేదీన ఢిల్లీలోని అనాథ స్త్రీ, శిశు శరణాలయం 'కస్తూర్బా నికేతన్'ను సందర్శించారు. ప్రధానివెంట ఉన్నవారు కేంద్ర పునరావాసశాఖ ఉపమంత్రి జె. కె. భాన్సలే.

## గోవా సమస్యాపరిష్కారంకోసం ఎవ్వరినీ బిచ్చమెత్తం

### పోర్చుగీసులు వదలిపోవడం తథ్యమని శ్రీ నెహ్రూ నమ్మకం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 6: "గోవా వ్యవహారానికి పరిష్కార మార్గం ఒక్కటే వుంది. పోర్చుగీసులను అక్కడి నుంచి వెడలనడవడం, దాన్ని భారత దేశంలో చేర్చడం. గోవన్లు కాదన్నా మనం పోర్చుగీసుల్ని సహించం. ఒక్క విదేశీ వలస వ్యవస్థ తన నడినెత్తిని కూర్చోవడం ఏ దేశమూ సహించదు. మనం అంతకన్నా సహించం" అని ప్రధాన మంత్రి శ్రీ జవహర్ లాల్ నెహ్రూ రాజ్యసభలో విదేశాంగ వ్యవహారాలను గూర్చి జరిగిన చర్చకు సమాధానం ఇస్తూ వివరం చేశారు.

రాజ్యసభలో విదేశాంగ విధానంపై ఆరుగంటలు చర్చ జరిగింది. చర్చకు సమాధానం ఇస్తూ ప్రధానమంత్రి కమ్యూనిస్టుసభ్యులు చేసిన విమర్శలకు సునిశితంగా సమాధానాలు ఇచ్చారు. సభ నెహ్రూ విధానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించింది.

"ప్రస్తుత పరిస్థితులలో గోవా విషయమై సత్యాగ్రహం చేయడం అనవసరమని శ్రీ నెహ్రూ ఈ సందర్భంలో స్పష్టం చేశారు. అది సమూహ సత్యాగ్రహం కానీయండి. వ్యష్టిసత్యాగ్రహం కానీయండి, గోవా విమోచనానికి అడ్డు వస్తుందేగాని, దోహదం ఇవ్వదు అని గట్టిగా చెప్పారు.

ఇప్పుడు గోవా భారతదేశం సరిహద్దులను పూర్తిగా మూసివేశాం. మన మ్యాలేకాదు, బళ్లు, సరుకులు ఏవీ పోయేటందుకు వీలు లేదు. ఇదిగాక ఆర్థిక ఆంక్షలను కొంతకాలం అమలు పరుస్తున్నాము. రాజకీయ సంబంధాలు తెగతెంపులు చేసుకుంటేనేగాని ఆర్థిక సంబంధాలు తెంచుకునే వీలులేదు. ఇప్పుడు రాజకీయ సంబంధాలను తెందుకున్నాము గనుక, ఆర్థిక సంబంధాలు కూడా క్రమంగా తెగిపోతాయి" అన్నారు.

కొంతమంది విమర్శకులు "అన్ని దేశాలతో సు రాయబారి సంబం

3 వ పేజీ చూడుడు

## సత్యాగ్రహులు సరిహద్దులు దాటరాదని ఉత్తరువులు

### పోర్చుగీసులనిరంకుశం పెరుగుననేభయం

బొంబాయి, సెప్టెం 7: భారతీయ సత్యాగ్రహులు ఇక గోవాలో ప్రవేశించడానికి వీలులేదు.

ఎవ్వరినీ గోవాలోకి వదలవద్దని బొంబాయిప్రభుత్వం బొంబాయి - గోవా, బొంబాయి - డామన్ సరిహద్దులలోని పోలీసులకు ఉత్తర్వు జారీచేసినట్లు తెలిసింది. దియ్యూ సరిహద్దుపోలీసులకుకూడా సౌరాష్ట్ర ప్రభుత్వం ఇలాంటి ఉత్తర్వులే ఇచ్చినట్లు తెలిసింది.

ఈ ఉత్తర్వుల ప్రకారం భారతీయులు విడివిడిగాగాని, దళాలుగాగాని దేశంలోని పోర్చుగీసు స్థావరాలలో ప్రవేశించడానికి వీలులేదు.

అప్పుడే పోలీసుఅధికారులు బెల్గాంలోని గోవావిమోచనసమితి నాయకులను కలుసుకొని గోవాకు సత్యాగ్రహదళాలను పంపవద్దని కోరారట. ఆ సమితి కార్యదర్శి డా॥ జి. యార్కీ ఇవాళ పి. టి. ఐ. విలేఖరితో మాట్లాడుతూ, ఇటుపై సత్యాగ్రహులను పంపితే, వారిని సరిహద్దువద్ద ఆపివేయవలసివస్తుందని పోలీసుఅధికారులు తమకు చెప్పినట్లు వెల్లడించారు. నిన్న బందా చేరిన 25 మంది సత్యాగ్రహులనూ బెల్గాంకు పంపివేస్తామనికూడా పోలీసుఅధికారులు చెప్పారు.

#### సత్యాగ్రహం కొనసాగించ నిర్ణయం

గోవావిమోచన సమితి బెల్గాంశాఖ ఇవాళ సమావేశమై, ప్రభుత్వం కూడదని ప్రకటించినా, గోవా సత్యాగ్రహాన్ని కొనసాగిం

(3 వ పేజీ చూడుడు)

## ఒరిస్సా వరదలతో లక్షలాది ప్రజల విపత్తు

### నదులకు గండ్లు: ఇంకా వర్షాలుపడే సూచనలు

కటక్, సెప్టెంబరు 6: మహానది వరదలలో 7 గురు మనుష్యులు కొట్టుకుపోయివుంటారని జిల్లా అధికారులు ప్రభుత్వానికివార్తలుపంపారు. అయితే ఇవి ఇంకా ధృవపరచలేదు. పశువులు మాత్రం చాలా కొట్టుకుపోయాయని అధికారులు తెలియజేశారు. కటక్, పూరి, బాలసూర్ జిల్లాలలో యీ వరదలలో మొత్తం 8 లక్షలమంది చిక్కుకుపోయారని తాజాసమాచారం అందింది. 80 లక్షలమంది ప్రజలు నివసించే 6 వేల చదరపుమైళ్ళ ప్రాంతమంతా వరదనీటితో నిండివున్నది.

ముఖ్యమంత్రి ఢిల్లీనుంచి తిరిగిరాగానే విమానంలో ఆ ప్రాంతాలన్నీ పర్యటించారు. వరదల వుధృతంతగ్గి సరియైన సంబంధాలు ఏర్పడితేగాని జననష్టం సంగతి తెలియదని శ్రీ నవకృష్ణచౌదరి చెప్పారు.

అత్యవసరమైన పదార్థాలతో ఒక ప్రత్యేక రైలును కలకత్తానుంచి పంపిస్తున్నారని తెలిసింది.

బ్రాహ్మణీనదిగట్లనువిరుచోట్లగండ్లు పడ్డాయి. 300 చదరపుమైళ్ల ప్రాంతాన్నంతా జలమయం చేసివేసింది. భార్గవినది ఎదమగట్టుకు రెండుచోట్ల గండ్లు పడ్డాయి. వరదలలో చిక్కుకుపోయిన ప్రజలకు విమానాల ద్వారా ఆహార పదార్థాలు అందించడానికి అధికారులు ఏర్పాట్లు చేస్తున్నారు.

మహానది నీటిమట్టం 76.2 అడుగుల నుంచి 75.6 అడుగులకు తగ్గింది.

#### వరదకు వాన తోడు

మహానది బ్రహ్మణి నదులకు యింతవుధృతంగా వరదలు ఎన్నడు రాలేదు. రాష్ట్ర చరిత్రలోనే యిట్టి వరదలు వచ్చినట్లు ఎక్కడా కన్పించదు. మహానదిలో నీటిమట్టం అతి నిదానంగా తగ్గుతున్నా వాతావరణ అధికారుల ప్రకటన చూస్తే బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడుతున్నట్లు తెలిసింది. నిన్న కూడ కుంభవృష్టి కురిసింది.

కేంద్రపారా, జాజ్ పూరు, పట్టణాలలో వరదనీరు ప్రవేశించింది. జాజ్ పూర్ తో గత రెండురోజులుగా సంబంధాలు తెగిపోయాయి. (స్వ. వి.)

### భోపాల్ లో వరదల భీభత్సం

భోపాల్, సెప్టెంబరు 6: విపరీతమైన వర్షాల మూలంగా భోపాల్ రాష్ట్రంలో నదులన్నిటికీ వరదలు బాగా వచ్చాయి. అనేక ప్రాంతాలకు రాకపోక సంబంధాలు తెగిపోయాయి. ఇక్కడకు 25 మైళ్లలో వున్న సెహోర్ పట్టణం మినహా మిగతా అన్ని ప్రాంతాలతో భోపాల్ కు సంబంధం తెగిపోయాయి. వందలకొలదీ ఎకరాలలో చెరకు, ప్రత్తి, జొన్న, పంటలు దెబ్బతిన్నాయి. చేలన్నీ నీట మునిగాయి.

సెహోర్ జిల్లాలో అనేక గ్రామాలలో ఇళ్లు కొట్టుకుపోయాయని జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు ప్రకటించాడు. రాకపోకలు తిరిగి సరిగా ఏర్పాటయితేగాని నష్టాల వివరాలు తెలియవని అధికారులు అంటున్నారు.

## రాష్ట్ర ప్రణాళికల ఖర్చు త్వరలో నిర్ణయమౌతుంది

### పెట్టుబడి కార్యక్రమాలకు లోపం రాదని ముఖ్యమంత్రి భావం

### తుంగభద్ర మెట్టకాలవపై మైసూరు ప్రభుత్వంతో త్వరలో ఒప్పందం

కర్నూలు, సెప్టెంబరు 7: రెండో పంచవర్ష ప్రణాళిక క్రింద ఏ రాష్ట్రం ఎంత ఖర్చు చేయవలెనో ప్లానింగు కమిషన్ త్వరలోనే తెలియజేయగలదని ముఖ్యమంత్రి శ్రీ బి. గోపాలరెడ్డి పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ చెప్పారు.

రాష్ట్ర ప్రణాళికలో వివిధ పద్దుల క్రింద కోతలు తప్పవని, పెట్టుబడి పథకాలు మాత్రం దెబ్బతినక పోవచ్చునని అన్నారు.

ఆంధ్రరాష్ట్రంలో ఎరువుల ఫ్యాక్టరీ వంటిదైన భారీపరిశ్రమలను స్థాపించవలసిన అవసరాన్ని తాము ప్లానింగు కమిషన్ కు విన్నవించినామనీ, యీ విషయంలో వారినిర్ణయం అనతికాలంలో తెలియనున్నట్లు ముఖ్యమంత్రి చెప్పారు.

తుంగభద్ర మెట్టకాల్వ విషయమై ఆంధ్ర మైసూరు ప్రభుత్వాల మధ్య ఏర్పడిన భేదాభిప్రాయాలు త్వరలో పరిష్కారం కాగలవని తాను భావిస్తున్నట్లు కూడా శ్రీ గోపాలరెడ్డి చెప్పారు.

#### తగాదా సమసిపోగలదు

"ఈ కాల్వకు రూ 19 కోట్లు అవుతుంది. ఉభయప్రభుత్వాలు కలిసి నిర్మించవలసివుంది. దీని విషయమై ప్లానింగు కమిషన్ ప్రతినిధులు ఆంధ్ర, మైసూరు ప్రభుత్వాల ప్రతినిధులు కలసి ఢిల్లీలో సమాలోచనలు జరిపారు. ఆ సందర్భంలో మైసూరు ప్రభుత్వం ఇందులో నీటి సప్లయికి సంబంధించిన సాంకేతిక సమాచారాన్ని తమకు అందచేయవలసినదని అడిగినది. ఆ సమాచారాన్ని ఆంధ్రప్రభుత్వం అందచేసిన వెంటనే ప్రస్తుతం తగాదాలు సమసిపోగలవని నేను భావిస్తున్నాను," అని శ్రీ గోపాలరెడ్డి అన్నారు.

వంశధార ప్రాజెక్టు విషయమై ఒరిస్సాతో త్వరలోనే ఒప్పందం కుదురుతుందని ముఖ్యమంత్రి ఆశిస్తున్నారు."

### రష్యా ఈజిప్టుల వస్తుమార్పిడి ఒప్పందం

కైరో, సెప్టెంబరు 6: నూనె, బియ్యం బదులుకు బదులు యిచ్చుకొనే దానికి రష్యా ఈజిప్టులు వస్తుమార్పిడి ఒప్పందం కుదుర్చుకొన్నాయి. ఉభయ ప్రభుత్వాల ప్రతినిధులు ఆ ఒప్పందంపై సంతకాలుచేశారు.

ఒప్పందంప్రకారం రష్యా ఈజిప్టుకు 5 లక్షలటన్నుల నూనెసరఫరాచేస్తుంది అందుకుబదులుగా ఈజిప్టు 60 వేల టన్నుల బియ్యంయిస్తుంది.

జర్మనీకి 60 వేల టన్నులు జపానుకు 20 వేలటన్నులు బియ్యం ఎగుమతిచేయడానికి, వాటితో, ఈజిప్టు ఒప్పందం కుదుర్చుకొన్నది.

## తాళ్లపురం అగ్నిబాధితులకు ఉచితంగా వస్త్రాలు

కర్నూలు, సెప్టెంబరు 6: కొలిపల్లి గూడెం తాలూకా తాళ్లపురంలో జూన్ 6 న సంభవించిన అగ్నిప్రమాదంలో నష్టపడినవారి కుటుంబాలకు వస్త్రాలు ఉచితంగా పంచేందుకు రు. 742/-లను రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసింది.







### గుంటూరు మునిసిపాలిటీ

ఈ క్రింద పేర్కొనబడిన ఉద్యోగాలకు, తగిన యోగ్యతలుగల వ్యక్తుల నుండి 22-9-55 తేదీవరకూ ఈ క్రింద సంతకం చేసిన వారికే దరఖాస్తులు స్వీకరించబడును.

1\. ఇంజనీరింగు సూపర్ వైజరు- స్కేలు రు. 100-5-150-10-180. బి. ఇ; లేదా ఎల్. సి. ఇ; లేదా వీటికి సరిసమానమైన మరే యోగ్యతలైనా.

2\. పార్కు సూపరింటెండెంటు- స్కేలు రు. 60-2½-80.
21-10-41 తేదీగల జి.ఒ. నెం. 2887 L. A. లో పేర్కొన్న యోగ్యతలు.

3\. ఇంజనీరింగు డ్రేసర్ - స్కేలు రు. 35-1-55. జామెట్రికల్ డ్రాయింగు; బిల్డింగు డ్రాయింగు; మరియు ఎస్టిమేటింగు, ఫ్రీ హాండ్ ఔట్ లైన్ మరియు మోడల్ డ్రాయింగు సాంకేతిక పరీక్షలలో ఉత్తీర్ణులైనవారు.

Md. మొహిద్దీన్ హుసేన్,
కమీషనర్.

నర్సారావుపేట డి॥ ము॥ కోర్టులో
O. S. 57/55

వాది:-రెడ్డి కోటి నారాయణ.
ప్రతివాదులు:-3. ధూళిపాళ్ల స్వరాజ్య లక్ష్మి, 4. మద్దెల నాగరత్నం వగైరా.

ఇందలి వాది ప్రతివాదులపై కాకిట్టు దస్తావేజును బట్టి రు. 381-6-0 లకు దావా వేయగా 3, 4-వ ప్రతివాదులకు నోటీసు నిమిత్తం 30-9-55 తేదీకి వాయిదా వేసినారు గనుక ఆరోజు మీరు మీకు గల ఆక్షేపణలను కోర్టువారితో మనవిచేసికోవలెను. లేని యెడల యక్సుపార్టీ చేయబడును.

కే. నారాయణరావు, అడ్వొకేటు.

### ఆంధ్ర విశ్వకళా పరిషత్తు
నోటిఫికేషను

1955 మార్చిలో జరిగిన ఇంటర్, మరియు మెట్రిక్ పరీక్షలలో ఉత్తీర్ణులైన అభ్యర్థుల ఉత్తీర్ణతా యోగ్యతా పత్రములకు గాను దరఖాస్తులు స్వీకరించుటకు ఆఖరు తేదీ - 18 నవంబరు, 1955. ఉత్తీర్ణతా యోగ్యతా పత్రాలకు గాను పంపే దరఖాస్తులతో సవ్యమైన ఐడెంటిఫికేషన్ సర్టిఫికెట్లు, మరియు ఒక్కొక్కదానికి రు. 8/- చలానాయు జతపరిచి పంపవలెను. అభ్యర్థులు సరాసరి పంపిన దరఖాస్తులు అంగీకరించబడవు. పై తేదీ తర్వాత ఉత్తీర్ణతా యోగ్యతా పత్రములకు దరఖాస్తు చేసే అభ్యర్థులకు, ప్రతి ఒక్కొక్కదానికి రు. 10/-లు రుసుం విధించబడును. అభ్యర్థులను గుర్తించే వ్యక్తి, లేదా వ్యక్తులకు 15 డిసెంబరు, తర్వాత యోగ్యతా పత్రము జారీచేయబడును.

(అనుమతితో)

కే. వి. గోపాలస్వామి,
రిజిస్ట్రార్,
యూనివర్సిటీ ఆఫీసు.
వాల్తేరు.
2-9-1955.





# రాష్ట్ర వార్తలు

## విజయవాడ

'తెలుగు సాహిత్య రీతులు' అను విషయంపై యీ నెల 2 న రోటరీక్లబ్బులో శ్రీ అమరేంద్ర ప్రసంగించారు. శ్రీ కె. వెంకటేశ్వరన్ అధ్యక్షత వహించారు. శ్రీ గోంధలేకర్ గారు వందన సమర్పణ చేశారు.

కృష్ణాజిల్లా మోటారు కార్మిక యూనియన్ విజయవాడ నగర బస్సు కార్మిక యూనియనుల అధ్వర్యంలో జరిగిన బహిరంగసభలో కృష్ణాజిల్లా మోటారు కార్మిక యూనియను ఉపాధ్యక్షులు శ్రీ గొట్టిపాటి భద్రయ్యగారి మరణంపట్ల విచార జిలిబుచ్చుతూ తీర్మానించారు. ఇటీవల కృష్ణానదిలో జరిగిన స్టీమరు ప్రమాదంలో శ్రీ భద్రయ్య మరణించిన సంగతి పాఠకులకు విదితమే.

## తెనాలి

సి. బి. ఆర్. బోర్డు ఉన్నత పాఠశాల సహాయ కేడెట్ దళానికి ఈ నెల 2 న కెప్టెన్ శ్రీ యం. యస్. శర్మ ప్రారంభం చేశారు. శ్రీయుతులు కె. సుబ్రహ్మణ్యం, డి. హనుమంతరావుగార్లు ప్రసంగించారు. శ్రీ సి. యస్. ఆర్. కృష్ణశాస్త్రి వందనములర్పించారు.

## గుంటూరు

బ్రహ్మశ్రీ పిల్లలమర్రి రామదాసు భాగవతారుగారు శ్రీ మోహన రంగనాయకస్వామివారి ఆలయంలో 60 రోజులపాటు సంపూర్ణ రామాయణం హరికథా కాలక్షేపం చేశారు. శ్రీ కేసానుపల్లి సుబ్బారావుగారు భాగవతారుగారికి అర్ధనూట పదహార్లు సమర్పించారు. ఇదిగాక వేరే రు 300/-లు కూడ సమర్పించారు. శ్రీ ముప్పాళ్ళ సూర్యనారాయణ, పాటిబండ భరద్వాజులు, కలశాల వెంకటకృష్ణమూర్తి గారలు తదితర ప్రముఖులు యథాశక్తి సత్కరించారు.

## భీమవరం

న్యాయవాద వృత్తిలో ప్రవేశించిన శ్రీ నూకల రామానుజరావుగారు స్థానిక న్యాయవాద సంఘంవారికి ఇటీవల విందుచేశారు. శ్రీ తాడిమళ్ల జగన్నాథరావుగారు ప్రసంగించారు.

స్థానిక కళాశాల వాణిజ్యశాఖ యూనియన్‌ను హైకోర్టు అడ్వకేటు శ్రీ ఇ. వెంకటేశం ప్రారంభించారు. కంపెనీల బిల్లుపై శ్రీ వెంకటేశం ప్రసంగించారు. వ్యక్తిగత వ్యాపారంపై సాధ్యమైనంత తక్కువ నిర్బంధాలుండాలని అన్నారు. శ్రీ జి. లక్ష్మీకాంతరావుగారు అధ్యక్షత వహించారు. శ్రీ యస్. పి. పాండే వందనములర్పించారు.

## చీరాల

ఫిర్కా వ్యవసాయకూలీల కాంగ్రెసు సమావేశం ఆగస్టు 31న జరిగింది. శ్రీ అన్నం వెంకటేశ్వర్లు అధ్యక్షత వహించారు. రొంపేరు భూముల పంపకం విషయంలో వెనుకటి మంత్రివర్గం 1954జూన్ 7న జారీచేసిన ఉత్తర్వును అమలు పరచాలని ప్రభుత్వాన్ని కోరారు. ప్రభుత్వానికి తమ కోరికలు తెలియజేయవలసిందిగా యీ ప్రాంతపు శాసనసభ్యులను అభ్యర్థిస్తూ మరో తీర్మానం ఆమోదించారు.

## నంద్యాల

భారతీయ వైద్య సంఘ స్థానికశాఖను ప్రారంభించాలని గత నెల 28న ఇక్కడి పురపాలక సంఘ ఉన్నత పాఠశాల ఆవరణలో జరిగిన వైద్యుల సభలో తీర్మానించారు. సభకు శ్రీ కె. ఉళక్కి అధ్యక్షత వహించారు. శ్రీ జి. వి. హనుమంతరావుగారు ప్రసంగించారు. శ్రీ కె. ఆర్. మోహనరావు వందన సమర్పణ చేశారు.

## తాడిపత్రి

పురపాలకసంఘ ఉన్నత పాఠశాల విద్యార్థి సంఘానికి శ్రీ హెచ్. కె. శ్రీనివాసరావుగారిని అధ్యక్షులుగా ఎన్నుకున్నారు. సభకు శ్రీ ఎం. లక్ష్మీనారాయణగారుఅధ్యక్షత వహించారు. శ్రీ వై. విశ్వనాథన్ గారు ప్రసంగించారు.

## మార్కాపురం

మార్కాపురంరేంజి అటవీశాఖ సంఘంవారు శ్రీ ఎల్. వెంకటేశ్వర్లుగారి అధ్యక్షతన సమావేశమైనారు. మార్కాపురంలో ప్రజల సౌకర్యార్థం వంట చెరుకు డిపో పెట్టాలని, చిన్న ఉద్యోగులను ఏడాదికి ఒకసారి బదిలీ చేస్తూ ఉండటం అవసరమని అభిప్రాయపడ్డారు. ఇదివరలో చేసిన కొన్ని తీర్మానాలపై ప్రభుత్వము, జిల్లా అటవీశాఖాధికారి ఇచ్చిన సలహాలకు కృతజ్ఞత తెలిపారు.

## గజ్జలకొండ

వియిసెడ్ ప్రాథమికోన్నత పాఠశాల ద్వితీయ వార్షికోత్సవం శ్రీ వి. ఎస్. వర్ధనరావుగారి అధ్యక్షతన జరిగింది. బహుమతుల పంపకం, నృత్య నాటిక ప్రదర్శనలు జరిగినవి.

## తాళ్లమండుసారు

ఆంధ్రరాష్ట్ర హరిజనసేవక సంఘ కార్యదర్శి, సెట్టి వెంకటచలపతిగారు, క్రితం 28 వ తేదీని ఇక్కడికి వచ్చి, క్షేమదాసంతోను, వెలగల దాని రెడ్డి ప్రభృతుల విరాళాలతోను, నిర్మిస్తున్న దేవాలయం చూసి సంతృప్తి వెల్లడించారు. దేవాలయ నిర్మాణానికి రూ 500 వాక్కు ఇచ్చారు. దేవాలయం పూర్తికాగానే మరి రూ 250 ఇవ్వగలమని వాగ్దానం చేశారు.

## నూతిమడుగు

కల్యాణ దుర్గం తాలూకా నూతిమడుగులో గత నెల 30 వ తేదీన హరిజన దినోత్సవము జరిగినది. జిల్లా కలెక్టరుగారు అధ్యక్షత వహించారు. హరిజనాభ్యుదయమును గురించి శ్రీ పప్పూరి రామాచార్యులు, శ్రీ కె. శాంతప్ప. శ్రీ యస్. సుబ్బారెడ్డి మొదలగు వారు ప్రసంగించారు.

శ్రీ కేశవనాథ్ గారు వివిధ నాట్య భంగిమలతో భావప్రకటన గావించి ప్రజల మన్ననకు పాత్రులైనారు. సెన్సారు రహస్య సంచారమును గూర్చిన సినిమా ప్రదర్శించారు.

## అప్పికట్ల

గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా అప్పికట్ల సెకండరీ బోర్డు హైస్కూలు నందు 'బాలభట సంఘము'ను ఏర్పాటు చేసుకున్నారు. 'బాలభట సంఘ ఉపాధ్యాయులు' శ్రీ సూర్యప్రకాశరావు గారు, దాదాపు 40 మంది విద్యార్థులను చేర్చుకొన్నారు.

## ఆత్రేయపురము

మహాత్మా గాంధీ హైస్కూలులో యీ నెల 1 న శ్రీ పి. వి. రాఘవాచార్యగారి అధ్యక్షతను సంగీత సాహిత్య సభలు జరిగాయి. వక్తృత్వపు పోటీలో యం. సూర్యనారాయణకు బహుమతి లభించింది.

శ్రీ ముప్పిడి లక్ష్మీనారాయణగారు సంగీత కళనుగూర్చి ప్రసంగించిన పిదప, తమ గానమాధుర్యముచే సభ్యుల నానందపరిచారు. శ్రీ కె. సత్యనారాయణమూర్తిగారు "కావ్యము - కళ" అను శీర్షికపై ఉపన్యసించారు. శ్రీ యస్. వి. నరసింహారావుగారు, ఆంగ్ల, ఆంధ్ర సాహిత్యాలలోని ప్రత్యేకతలను వివరించారు. శ్రీ టి. సుబ్బారావుగారి వందన సమర్పణముతో సభ ముగిసింది.

## తిరుపతి

యువజన కాంగ్రెసు అధ్వర్యాన యీ నెల 2 న శ్రీ టి. శ్రీనివాసన్ అధ్యక్షతన బహిరంగ సభ జరిగింది. శ్రీ పి. మునిరెడ్డి స్వాగతమిచ్చారు. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం స్థాపించాక మొదటి సంవత్సరం జయప్రదంగా ముగిసినందుకు అభినందించారు. శ్రీ వి. ఆర్. నాయుడు గోవా సత్యాగ్రహ పోరాటంలో తమ అనుభవాలు, అక్కడిపరిస్థితులు వివరించారు.

## తిరుత్తని

డిప్యూటీ కమర్షియల్ టాక్సు ఆఫీసరు శ్రీ యం. వి. సుబ్బారాయుడుగారు తిరుపతి సర్కిల్‌కు బదిలీ అయిన సందర్భంలో శ్రీ మునుస్వామినాయుడు స్మారక క్లబ్ సభ్యులు యీ నెల 1 న శ్రీ పి. మల్లికార్జునంగారి అధ్యక్షతన శ్రీ సుబ్బారాయుడుగారిని సన్మానించారు.

## అరకోణము

అరకోణము బోర్డు ఉన్నత పాఠశాల ఆంధ్ర సారస్వత సంఘ ప్రారంభోత్సవం ఈ నెల 2 వ తేదీ పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ జి. విలియమ్సు గారి అధ్యక్షతను జరిగింది. తిరుత్తని బోర్డు ఉన్నత పాఠశాల- పండితులు విద్వాన్ ఎస్. చెంగోజిరావుగారు సంఘాన్ని ప్రారంభిస్తూ "ఆంధ్ర భాషా వికాసము" అను విషయాన్ని గూర్చి మాట్లాడారు. విద్యార్థులు నానా ప్రదర్శనాలతో సదస్యులను మెప్పించారు. కార్యక్రమానంతరం విద్వాన్ పి. నారాయణస్వామిగారి వందన సమర్పణముతో సభ ముగిసింది.

## రాజంపేట

స్థానిక తహశీలుదారు శ్రీ హయాత్ గారిని రాయచోటికి బదిలీ చేశారు. వారిస్థానే శ్రీ వి. సుబ్బయ్యగారిని ఇక్కడ నియమించారు. ఈ సందర్భంలో శ్రీ హయాత్ గారిని తాలూకా కాంగ్రెసు కార్యదర్శి శ్రీ ఆరెం అన్నయ్యగారు సన్మానించారు. పలువురు ప్రసంగించారు.

## గుంతకల్లు

హరిజన బాలికల వసతి గృహంక్రొత్త పాలకవర్గం ఇటీవల ఏర్పాటైనది. అధ్యక్షులు-శ్రీ సి. అరుణాచలం, ఉపాధ్యక్షులు-శ్రీ బి. ఆర్. లింగం, సభ్యులు శ్రీయుతులు యస్.దావూద్ సాహెబ్ బి. యస్. Kం గాఫర్, యం. రాజారాంగార్లు. కార్యదర్శి శ్రీ కె.తిప్పయ్య ఎక్సుఆఫీషియో సభ్యులు-మహిళా సంక్షేమ శాఖ ఆర్గనైజరు, లోకల్ ఫండ్ ఆస్పత్రి వైద్యులు, పురపాలక సంఘ కమీషనరు.

## సభలు-సమావేశాలు

ఈ నెల ఆఖరులో సామర్లకోటలో అభివృద్ధి కార్యక్రమశాఖ ఉద్యోగుల చర్చా సమావేశం రెండు రోజులు జరుగుతుంది. భారత ప్రభుత్వ సమాజ వికాస కార్యక్రమశాఖ అధికారి శ్రీ ఎస్. కె. డే యీ సమావేశానికి వస్తాడనుకుంటున్నారు.

శ్రీకాకుళంజిల్లా వెనుకబడిన తరగతుల మహాసభ ఈ నెల 9 వ తేదీన టెక్కలిలో జరుగుతుంది. మంత్రి గౌతు లచ్చన్న గారు సభకు ప్రారంభోత్సవం చేస్తారు.

## శ్రీ జయంతి

మదరాసు, సెప్టెంబరు 7 : మాంబలం శ్రీ శారదా ప్రాథమికోన్నత పాఠశాలలో రేపు 9 వ తేదీ సా. 6 గం. శ్రీ వెంకటేశ్వరానంద అధ్వర్యమున శ్రీ కృష్ణజయంతియు, శ్రీ స్వామి శివానంద జయంతియు జరుపబడును. ఆ సందర్భమున అన్నూకాలేజి సంస్కృత పండితులు శ్రీ టి. కె. వెంకటేశ్వరన్ గారును వారి గోష్ఠియు భజన చేస్తారు.

# హైదరాబాదు సికింద్రాబాదు ఏకీకరణ బిల్లుపై చర్చలు

## ప్రతిపాదనోద్దేశం సభ్యులకు అర్థం కాలేదట

సికింద్రాబాదు, సెప్టెంబరు 7: — హైదరాబాదు సికింద్రాబాదు నగరాల ఏకీకరణ బిల్లుపై హైద్రాబాదు రాష్ట్ర శాసనసభలో ఈవాళ రెండవరోజు చర్చ సందర్భంలో తీవ్ర వాదోపవాదాలు జరిగినవి. ఈ సమస్య గురించి నిర్ణయాధికారం ఈ నగరాల పాలక సంఘాలకు ఇచ్చే అవకాశం బిల్లునుంచి తొలగించాలని ప్రతిపక్ష సభ్యులు వాదించారు. ఆ అధికారం నగర పాలక సంఘాలకు ఉంచవలసిందేనని కాంగ్రెసు సభ్యులు వాదించారు. చివరికి ఈ రెండు నగరాలను కలిపివేసే సూచనను అనుకూలంగా ప్రజాభిప్రాయాన్ని రూపొందించుకోవాలని ఉభయపక్షాలు రాజీపడ్డారు.

ప్రతిపాదనను గట్టిగా వ్యతిరేకిస్తూ వల్లూరి బసవరాజు గారు ఇట్లాఅన్నారు: "రెండు కార్పొరేషన్లను ఏర్పాటుచేసే చట్టం జిల్లాడీ పరిపాలనలో అములులోకి వచ్చింది. తిప్పర్యవసానంగా రెండు కార్పొరేషనులు ఏర్పడినవి. ఇప్పుడుమళ్లీ ఈరెండింటినీ ఎందుకు కలిపివెయ్యాలను కుంటున్నారోఅర్థంకావటంలేదు. ప్రజాస్వామిక పరిపాలనలో ఆలోచనలకు పొంతి అనేది లేకపోతే పెద్ద ప్రమాదమే వస్తుంది. ఒటువంటి ఆలోచనల వల్ల మంత్రులు ప్రజలకు దూరమై పోవచ్చు. ఒకే ఒక కార్పొరేషన్ యేర్పాటుచేసి రెండు నగరాల వ్యక్తిత్వాన్ని కాపాడే ఏర్పాటు చేయడం మంచిది. హైద్రాబాద్ కార్పొరేషన్ కంటె సికింద్రాబాద్ కార్పొరేషన్ చాలా అభివృద్ధి చెందింది. అందువల్ల ఆ కార్పొరేషన్ను హైద్రాబాద్ కార్పొరేషనులో కలిపివేయడం సికింద్రాబాద్‌కు నష్టం. ఫోరేబిల్లులోని మిగతా అంశాలన్నీ చాలా బాగున్నవి. ప్రతిపక్ష సభ్యుల విమర్శలు సహేతుకం కావు."

ప్రాథమిక విద్యను కార్పొరేషన్ పర్యవేక్షణలో చేర్చి న్యాయ నిర్ణయాధికారాలుకూడా ఇవ్వాలని కాంగ్రెసు సభ్య డొకరు సూచించారు.

పన్నుల పద్ధతిని ప్రతిపక్ష సభ్యులు విమర్శించారు. పరిపాలనా నిర్వాహణాధికారాలన్నీ కమీషనరుకేఇచ్చే సూచనను కూడా నిశితంగా విమర్శించగా కాంగ్రెసు సభ్యులు అందు తెగ్గ సమాధానాలు చెపుతూ ప్రసంగించారు.

బిల్లును ఇంకా బాగా రూపొందించడానికి కనుకూలాగపడే సవరణలు సూచించవలసిందిగా స్థానిక పరిపాలనాశాఖ మంత్రి శ్రీ గోపాలరావు ఎక్బోటే సభ్యులను కోరారు. విభేదాలు ఎక్కువ చేసే మనస్తత్వాన్ని మార్చుకోవలసిందిగా ప్రతిపక్ష సభ్యులకు విజ్ఞప్తి చేశారు. ప్రజాస్వామిక పద్ధతులు ఈబిల్లులో ఉన్నవన్నారు.

## హైదరాబాద్‌లో హిందీవారం

హైదరాబాద్, సెప్టెంబర్ 8: హైదరాబాద్ నగర హిందీ ప్రేమీమండలి అధ్వర్యాన, అక్టోబరు మొదటివారంలో 'హిందీవారం' జరుప నిశ్చయించారు.

కార్యక్రమ నిర్ణాయక ఉపసంఘం లక్ష్మణరావుగారి అధ్యక్షతన గతవారం సమావేశమై చిత్తు కార్యక్రమం రూపొందించారు. మొదట గాంధీ జయంతి జరుపుతారు. మిగతా ఆరు రోజులు, సభ్యుల పేరిట, విద్యార్థుల పేరిట, ప్రత్యేక కార్యక్రమాలు ఉంటాయి.

## న్యూయార్కు ప్రత్తి జూదం

నగరి, సెప్టెంబరు 4: స్థానిక పోలీసు సబ్ ఇనస్పెక్టరు ఎస్. కె. భాషా గారు మొన్న సోమవారం రాత్రి ఇక్కడ న్యూయార్కు ప్రత్తి ధరలపై జూదం సాగుతున్న కొన్ని ప్రాంతాలపై దాడి జరిపి రు. 1600 నగదు, ఈ జూదానికి సంబంధించిన రసీదు పుస్తకాలు వశపరచుకున్నారు.

ఈ సందర్భంలో పట్టుబడ్డవారిలో ఎస్. వి. నటేశ ఆచారి, ఎస్. పళనిసెట్టి అను వారికి సబ్‌మేజిస్ట్రేటు రూపాయలు, మరి పదిమందికి ఏభైని రూ॥లు జరిమానా విధిస్తూ లిమిటెడ్ సబ్ మేజిస్ట్రేటు వై. వి. కుటుంబరావు గారు తీర్పు చెప్పారు. (స్వ. వి)

## గాయపాలుతగిలి రేచాక గ్రామస్థుని మరణం

అపకోపల్లి, సెప్టెంబరు 4 : అవకోపల్లి సమీపంలోని రేచాక గ్రామ నివాసి మంత్రి ఆదినారాయణ అనే ఆయనను ప్రమాదకర స్థితిలో చికిత్స నిమిత్తం ఇక్కడి ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకువచ్చారు. కాని ఇక్కడికి వచ్చిన తరువాత కొంచెం సేపట్లోనే ఆయన మరణించారు. శవపరీక్ష జరిగింది. విరోధు లెవరో కొట్టడంవల్ల ఆదినారాయణకు పెద్దగాయాలు తగిలినవట.

## ప్రజారోగ్యం

మదరాసు, సెప్టెంబరు 6: ఆంధ్ర రాష్ట్రంలో ఆగస్టు 27 వ తేదీతో అంతమైన వారంలో కలరా వ్యాధి ఎక్కడా ఉండలేదు. స్ఫోటకము 25 మందికిసోకి 9 మంది చనిపోయారు. మశూచి చిత్తూరు జిల్లా పలమనేరు తాలూకాలో 14 మందికి సోకి ముగ్గురు మరణించారు.

## మహబూబాబాద్ సినిమాహాలుపై దాడి
### విద్యార్థుల విచారణ

మహబూబాబాద్, సెప్టెంబరు 6 : ఈ పట్టణంలోని ఒక సినిమా హాలుపై యీ నెల 2వ తేదీన దాడి జరిగింది. ఆ రాత్రి రెండవ ఆట ప్రారంభం కాగానే ఈ అల్లరి జరిగింది. సినిమా హాలుకు దాదాపు 4 వేల నష్టం సంభవించిందంటున్నారు.

కొంతమందిని ఉచితంగా సినిమా చూడనిచ్చే విషయంలో ఈ తగాదా వచ్చిందట. దాడిచేసినవారిలో ఎక్కువ మంది విద్యార్థులని అంటున్నారు. సినిమా హాలులో విద్యార్థులకు కొన్ని మినహాయింపు సౌకర్యాలను ఇచ్చే విషయమై చాలాకాలంగా అహాలుయజమానులకూ విద్యార్థులకూ మధ్య తగాదా ఉన్నదట. ఏమైనా ఈ విధంగా హాలుపై పడి ఆ స్తికి నష్టం కలగ చేయడాన్ని వివిధ వర్గాలూ నిరసిస్తున్నారు.

జిల్లా పోలీసు సూపరింటెండెంటూ, డిప్యూటీ సూపరింటెండెంటూ ఖమ్మంమెట్టు నుంచి నిన్న ఇక్కడికి వచ్చి విచారణ జరిపించారు.

ఈ దాడి జరిగిన నేటిరాత్రి వరంగల్లు జిల్లా కాంగ్రెసు మాజీ అధ్యక్షుడు రామచంద్రారెడ్డిగారు ఇక్కడికి రావడం సంభవించింది. ఈ సంగతి విని కొంతమంది కాంగ్రెసు కార్యకర్తలతో అక్కడికి వెళ్ళి విద్యార్థులను సర్ది పంపించారు.

పోలీసులు ఈవేళ ఒక డజను మంది విద్యార్థులను విచారించారు.

## సినిమాకోసం కొట్లాట: ఒకని మరణం

ధన్‌బాద్, సెప్టెంబరు 6: రెండు సినిమాహాలుల ఎదుట గతరాత్రి జరిగిన కొట్లాటల్లో ఒకడు మరణించాడు. పోలీసులకు ప్రజలకూ ఈ కొట్లాట జరిగింది. ఒక సబ్ యిన్‌స్పెక్టరు, 11 మంది పోలీసులు గాయపడ్డారు. ఏదో చిత్ర ప్రదర్శన గురించి అసలు ఈ తగాదా వచ్చింది. ఆ చిత్రాన్ని ప్రదర్శించవద్దని స్థానిక వర్తక ప్రముఖుడొకరు కోరగా సినిమాహాలు యజమానులు అందుకు అంగీకరించారు. కాని దానిని ప్రదర్శించి తీరాలని జనం పట్టుబట్టారు. వారిని అదుపులో పెట్టడానికి పోలీసులు గాలిలోకి తుపాకులు పేల్చారు. తీవ్రంగా గాయపడిన వ్యక్తి ఈ ఉదయం మరణించాడు. ఝరియా పురపాలకసంఘ హద్దులో 144 వ సెక్షన్ అమలుచేశారు.

## అయ్యాలపాలెం దొమ్మీలో ఒకని మరణం
### 7 గురి అరెస్టు

యలమంచిలి, సెప్టెంబరు 6 : యలమంచిలి తాలూకా ఉపాల్మక శివారు అయ్యాలపాలెం గ్రామంలో కిందటి నెల 30-వ తేదీన పొలము తగాదా కారణంగా దొమ్మీ జరిగింది. ఈశ్వరపు అప్పన్న అనే ఆయన తీవ్రంగా గాయపడాడు, నక్కపల్లి ఆసుపత్రిలో చికిత్సకు చేర్చారు. కాని, అమర్నాడే ఆయన మరణించాడు. ఈసందర్భంలో నక్కపల్లి పోలీసులు 7 గుర్ని అరెస్టు చేసి యలమంచిలి సబ్-మేజస్ట్రేట్ కోర్టులో హాజరుపెట్టారు. సబ్-మేజస్ట్రేట్ ఆ 7 గురి వద్ద ఈ నెల 4 తేదీన వాఙ్మూలాలు తీసుకొని 'రిమాండు' లో ఉంచారు. పోలీసులు దర్యాప్తు సాగిస్తున్నారు.

## కీ॥ శే॥ శ్రీ కానూరి దామోదరయ్యగారు

మద్రాసు, సెప్టెంబరు 6 : కాతరం గ్రామప్రముఖులు కానూరు దామోదరయ్యగారు నిన్నరాత్రి ఇక్కడ మరణించారని తెలుపుటకు విచారిస్తున్నాము. వీరివయస్సు69 సంవత్సరాలు, కాతరంలోరూ 60 వేలు పెట్టి ఉన్నత పాఠశాల కట్టించారు.

## న్యూయార్కు దూది
### అక్టోబర్ వాయిదాధరలు

న్యూయార్కు, సెప్టెంబరు 6 : న్యూయార్కు కాటన్ మార్కెట్ ధరలు నేడీ విధంగా ఉన్నవి :

| | |
|---|---|
| నేటి ప్రారంభ ధర | 33.62 |
| నేటి ముగింపు ధర | 33.55 |

ఖమ్మంమెట్టు, సెప్టెంబరు 3 : ఖమ్మం సమీపంలోని తల్లంపాడు గ్రామనివాసి చలమయ్యఅనే వ్యక్తిని ప్రమాదకర పరిస్థితిలో ఇక్కడి ఆసుపత్రిలో చికిత్సకు చేర్చారు. అదే గ్రామానికి చెందిన మరొక అసామి చలమయ్యను గతనెల 31 వ తేదీన గొడ్డలితో కొట్టినందున చలమయ్య తలపై గాయం తగిలినట్లు తెలుస్తున్నది. పోలీసులు దర్యాప్తు సాగిస్తున్నారు.

# ఆకాశవాణి

సెప్టెంబరు శుక్రవారం, 9

### విజయవాడ

ఉ॥ 6-50 స్వాగతం 6-55 ప్రసార విశేషాలు 7-0 తెలుగు వా. 7-15 మదరాసు (బి) వలె 7-30 మద్రాసు వలె 8-0 ఆంగ్ల వార్తలు.

మ॥ 1-0 (బి) వలె 1-30 (ఎ) వలె 1-40 హిందీ వా. 1-50 తెలుగు వా. 4-0 గానసుధ (రి).

సా॥ 5-30 ఆ(ద్వ)పల్లి వీరాస్వామి నాదస్వరం 6-0 సంగీత శిక్షణ 6-15 ప్రాంతీయ వా. 6-25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామ కార్యక్రమం భారత విదుషీమణులు అనీబిసెంట్ 7-0 తెలుగు వా. 7-15 రంగులరాట్నం 7-30 కబోధ స్వర్గం (నాటిక) రచన 'సుధి' 7-45 మద్రాసు వలె 9.0 ఆంగ్ల వా. 9-15 వాద్యబృందం 9-30 గీతమంజరి 9-50 గానసుధ (రి) 10-0 ప్రసార సమాప్తి.

### మద్రాస్ (ఎ)

ఉ॥ 6-50 స్వాగతం 6-55 నేటి కార్యక్రమ వివరణ 7-0 వాద్య సమ్మేళనం 7-15 తమిళ వా. 7-30 నాదస్వరం (తిరుచినుండి రికార్డె) 8-0 ఆంగ్ల వార్తలు.

మ॥ 12-30 జెల్లం వేణుగోపాలన్ 1-30 గీతమంజరి (రి) 1-40 సింధీవా. 1-50 (రి) 2-0 తమిళ వా. 2-10 (బి) వలె 4-0 (బి) వలె 4-30 పాశ్చాత్య సంగీతం.

సా॥ 5-30 ఎం. లక్ష్మీ 6 ఆంగ్ల వా. 6-15 ప్రాంతీయ వా. 6-25 (బి) వలె 6-30 తమిళ సంగీత రూపకం 7-15 తమిళ వా 7-30 సంధ్యాగానం (రి) 7-45 (బి) వలె 9 ఆంగ్ల వా. 9-15 తిరుచి వలె 10 (బి) వలె 10-30 ప్రసార సమాప్తి

### మద్రాస్ (బి)

ఉ॥ 7 తెలుగు వా. 7.15 ఉదయ గానం (రి) 7-30 (ఎ) వలె.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 (ఎ) వలె (రి) 1-30 ఆంగ్ల వా. 1-40 (రి) 1-50 తెలుగు వా. 2 వయొలిన్ 2-15 ఎం. కె. రంగనాథపిళ్లై 4 బి. ఆర్. బలరాం - వేణువు 4-30 (ఎ) విలె.

సా॥ 5-30 (ఎ) వలె 6-15 ప్రాంతీయ వా. 6-25 లలితగీతం 6-30 గ్రామ॥ కార్యక్రమం 7 తెలుగు వా. 7-15 రంగుల రాట్నం 7-30 కన్నడ ప్రసంగం 7-45 తంజావూర్ లక్ష్మీనారాయణ భాగవతర్ 9 (ఎ) వలె 9-15 కోయలు: (ఆంగ్లమున ప్రసంగం) పి. టి. జయదేవ్ 9-30 క్షేత్రయ్య పదాలు : టి. బాలసరస్వతి టి. అభిరామసుందరి-వయొలిన్ టి. విశ్వనాథన్ వేణువు, టి. రంగనాథన్- మృదంగం, నిర్వహణ : డా॥ వి. రాఘవన్ 10 శాస్త్రీయ సంగీతం (రి) 10-30 ప్రసార సమాప్తి.

### హైదరాబాద్

ఉ॥ 6-50 స్వాగతం 6-55 కార్యక్రమ వివరణ 7 తెలుగు వా 7-15 ఎస్. వాగీశ్వర శాస్త్రి 7-45 గీత్ 8 ఆంగ్ల వా. 8-15 హిందీ వా. 8-30 ఖయాల్ 8-50 మహమద్ సుభాన్ ఖాన్-తబ్లా.

మ॥ 12-30 భక్తిగీతాలు (రి) 12-50 మరాఠీ వా. 1 మహిళోపరాజం జట్టు పని(ప్రసంగం) 1 45 నాదస్వరం (రి) 1-50 తెలుగు వా॥ 3-45 పాఠశాలలకు విజ్ఞాన శాస్త్రవేత్తలు: సి. వి. రామన్ (ప్రసంగం).

సా॥ 5-30 ఖయాల్ 5-50 హౌసింగ్ ఆట్ 6 మరాఠీలో కార్యక్రమం 6-30 తంత్రికారి (రి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గీతావళి (రి) 7 తెలుగు వా॥ 7-15 గ్రామసీమ 7-45 కన్నడ వా॥ 8 మద్రాస్ వలె 9 ఆంగ్ల వా॥ 9-15 ఉర్దూ వా॥ 9-30 సమితి విద్యార్థి వైజ్ఞానిక సాంస్కృతిక సంఘం కార్యక్రమం 9-45 తబ్లా 10 ఖయాల్ 10-30 ప్రసారసమాప్తి.

# మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 7:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-8 ఎడ్వర్డు బొమ్మ నేల్సుటాక్సుతో సహా రు. 62-0-0

| | |
|---|---|
| పెట్లాంబంగారం తులం | రు. 95-14-0 |
| మూస బంగారు | రు. 94-8-0 |
| సీమ వెండి తులం100 కి రెడి రు. | 167-0-0 |
| చిల్లర ధర | రు. 1-11-6 |

వేరుశనగ

(581 పా॥ 1-8 ఎక్సుకోస్తా గిడ్డంగులు మినీన్ సేల్సుటాక్సుతో సహా) రు. 102 నుండి 105-0-0

| | |
|---|---|
| వేరుశనగనూనె ఎక్సు పిల్లర్ బిల్లో కి (500పా.) రిటైల్ చిల్లరధర | రు. 200-0-0 |
| 197 టెంకాయనూనె (87½ పౌనులు) అంబుమార్కు | రు. 26-0-9 |
| ఎం ఎస్. బ్రాండ్ డబ్బా | 26-4-9 |
| రాజా | రు. 25-12-9 |

ఆముదం

| | |
|---|---|
| తిరుపత్తూరు (500 పా.) | రు. 165-0-0 |

పంచదార

| | |
|---|---|
| బ్రిటిష్ షుగరు (2 క్వాల్సు) | 85-8-9 |
| నైజామ్ (208 క్వాట్సు) | 86-2-9-86-8-9 |
| సామర్లకోట (2 క్వాట్) | 85-12-9 |

హైద్రాబాద్ మార్కెట్ ధరలు
(కాత్తూరి సీతయ్య కొట్టు)
హైద్రాబాద్, సెప్టెంబరు 7:

| | |
|---|---|
| పసుపుపల్లా | 120-0-0-218 |
| పెసలు | 28-6-0 27 |
| కందులు | 34-0-0-36-0-0 |
| మినుములు | 35-8-0-38-8-0 |
| ఉలవలు | 26-0-0-28-8-0 |
| లంకలు | 21-0-0-20 |
| కందిపప్పు పెద్దది | 41-46 |
| కందిపప్పు చిన్నది | 44-0-0 |
| పెసరపప్పు | 40-0-0-4 -0-0 |
| వేరుశెనగపప్పు | 48 0-0-49 |
| మినప పప్పు | 57-58 |
| ఆముదాలు | |
| చింతపండు | 26-8-0-30 |
| మిర్చి | 140-160 |
| కుసుములు | 25-8-0-28-0-0 |
| [illegible]లు | 10-4-0-10-12-0 |
| ఆవాలు | |
| [illegible] | 18-4-0-22-8-0 |
| నువ్వులు | 65-80-0-0 |

# జపాన్ దీవులు

## రష్యా అధ్వర్యం

లండన్, సెప్టెంబరు 6 : రష్యా ఆక్రమణలోవున్న జపానీస్ భూభాగాల భవిష్యంగురించి ఉభయదేశాల ప్రతినిధులకు నేటి సంప్రతింపుల్లో పేచీ వచ్చింది.

దక్షిణ సాఖాలిన్, కురైల్, హబోమాయి, షికోటాన్, దీవుల విషయంలో యీ అభిప్రాయభేదాలొచ్చాయి. వీటిమీద రష్యా పెత్తనం కొనసాగాల్సిందేనని మాలిక్ వాదించాడు. కావలసివస్తే యాల్టా, పోట్స్‌డాం, ప్రకటనలు, శాన్‌ఫ్రాన్సిస్కోలో 1951 లో జరిగిన శాంతిసంధి (దీనిపై జపాను సంతకంచేసింది) చూసుకోమని మాలిక్ ఖచ్చితంగాచెప్పాడని జపాన్‌వర్గాలవారు అన్నారు. ఆ ఒప్పందాలలోనే వీటిభవితవ్యం నిర్ణయమైందని మాలిక్ స్పష్టంచేశాడట.

# 9 మంది అమెరికన్ల విడుదల

## చైనాప్రభుత్వ నిర్ణయం

జనీవా, సెప్టెంబరు 6 : చైనాలోవున్న 9 మంది అమెరికన్లకు ఇప్పుడు తమ ఇళ్లకుపోయే అవకాశం కల్పించబడినట్లు జెనీవాలో జరుగుతున్న చైనా-అమెరికా రాయబారుల సమావేశం అనంతరం వెలువడ్డ ఒకప్రకటన తెలుపుతున్నది. ఇది ఈ రాయబారుల 18 వ సమావేశం.

చైనాలో ఇంకా కొందరు అమెరికన్లు వున్నారుగాని, వారు ప్రయాణపు అనుమతి పత్రాలకోసం దరఖాస్తులు పెట్టుకోలేదు. వారు ఆ దరఖాస్తులు పెట్టుకోగానే అనుమతిపత్రాలను ఇస్తారని చైనా రాయబారి వాంగ్, అమెరికా రాయబారి జాన్సనకు తెలియజేశారు.

పిడ్జి మేయర్ అనే ఇంకొక అమెరికనుకూడా చైనాలో వున్నాడు. కాని అయన వ్యవహారాలు తేలేసరికి ఇంకొక రెండు మూడు నెలలు పట్టునందని, అందాకా ఆయనకు అనుమతిపత్రం లభించదని వాంగ్, అమెరికా రాయబారికి తెలియజేశారు.

# ఫ్రెంచి ప్రభుత్వం నిలిపిన సుల్తాను

## యావజ్జీవం పదవి వదలడట

రాబాత్, సెప్టెంబరు 6 : తాను బ్రతికివున్నంత కాలం సుల్తానుగానే వుండదలచుకున్నట్లు ఫ్రెంచివారు నిల్పిన మొరాకో సుల్తాను సిదీమహమ్మద్ బెన్ అరాఫా నేడు ఫ్రెంచి రెసిడెంట్ జనరల్‌కు తెలియజేశాడు. అంతేగాక, "నేను నమ్మకంగా మీరు చెప్పినట్లు పనిచేస్తున్నాను గనుక, భగవంతుడు నన్ను చంపుకుపోయేదాకా నన్ను సుల్తానుగానే వుండనీయండి" అని ఫ్రెంచివారిని అభ్యర్థించాడు.

## మాస్టర్ తారాసింగ్ విడుదల

అమృతసర్, సెప్టెంబరు 6 : శిరోమణి అకాలీదళ అధ్యక్షుడు మాస్టర్ తారాసింగ్‌ను విడుదలచేస్తూ అమృతసర్ సెషన్సుజడ్జి ఇవాళ ఉత్తర్వులు ఇచ్చారు. భాషా రాష్ట్ర నినాదాలపై నిషేధాజ్ఞలను ధిక్కరించినందుకు అడిషనల్ జిల్లా మేజిస్ట్రేటు ఈయనకు నాలుగు నెలల కఠిన కారాగారం, రు. 4 వందల జరిమానా విధించారు. ఈతీర్పుపై అప్పీలును సెషన్సుజడ్జి విచారించి, దిగువకోర్టు తీర్పును ఖాయపరచాయి. అయితే శిక్షను శిక్షనుమాత్రం, మాస్టర్ తారాసింగ్ ఇప్పటివరకు అనుభవించిన కాలానికి తగ్గించివేసి, విడుదలకు ఉత్తర్వులు ఇచ్చారు. ఈయనకు విధించిన జరిమానా వాలుగువంపిలూ [illegible] చేశారు.

## మేజర్ జన॥

కర్నూలు, సెప్టె [illegible] ప్రాంతీయ సేనాప[తి] జె. సి. క[illegible] ఉద[illegible] పల్లి పోబోయే ముందు, [illegible] త్వం వద్ద వీడ్కోలు [illegible] నిన్న సాయంత్రం తిరిగి [illegible] వచ్చారు. ఇక్కడ ఉన్న ప్రభు రాజ భవనంలో బసచేశారు.

## న్యాయశాస్త్ర కళాశాల

మదరాసు, సెప్టెంబరు 7 : మాజీ న్యాయమూర్తి సత్యనారాయణ రావు గారు 8 వ తేదీ సాయంత్రం 5 గంటలకు న్యాయశాస్త్ర కళాశాల ఆంధ్ర సమితి ప్రారంభోత్సవం జరుపుతారు. శ్రీ వేపులపల్లి కృష్ణశాస్త్రి ఉపన్యసిస్తారు.

## గంటల పంచాంగం

శ్రీ మన్మథసం॥ అధిక భాద్ర॥ బ॥ సప్తమి 1955 - సం॥ సెప్టెంబరు 8 గురువారం శు॥ సప్తమి రా 2-32 కృత్తిక 15-58 లే వర్జ్యం 6-7 ల కు.

బ॥ అష్టమి సెప్టెంబరు 9 శుక్రవారం శు॥ అష్టమి 24-27రో హి-14-40 వర్జ్యం 7.6 ల 8-37 కు. వర్జ్యం 19-57 ల 21-28 కు. శ్రీ కృష్ణజయంతి.

# ఆంధ్రపత్రిక

ఒరు లేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథముల కెల్లన్
(మహాభారతము)

శ్రీమన్మథ సం॥ అధిక భాద్ర॥ బ॥ సప్తమి
గురువారం

## రెండు తెలుగు రాష్ట్రాలు

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం నివేదిక ఈ మాసాంతానికి సిద్ధమౌతుంది. విశాలాంధ్ర, బృహన్మహారాష్ట్ర, మహాగుజరాత్, సంయుక్త కర్నాటక, ఐక్య కేరళ రాష్ట్రాల విషయంలో ఫజల్ అలీ కమిషను నివేదికాంశాలు ఎలా వుంటవో అని అందరూ ఆందోళన, ఆశ, నిరాశలతో నివేదిక ప్రచురణను నిరీక్షిస్తున్నారు. కమిషను ప్రతిపాదనలపై ఇంతవరకూ చాలా ఊహాగానం జరిగింది. అధికార వర్గాలలో ఎవ్వరూ ఇంతవరకు ఈ ప్రతిపాదనల స్వరూపాన్ని సూచిస్తూగాని, వెల్లడిస్తూగాని ప్రకటనలు చేయలేదు. కేంద్రప్రభుత్వ దేశాంగ వ్యవహారాల మంత్రి పండిట్ గోవిందవల్లభ పంత్ మాత్రం అన్ని రాష్ట్రాలవారూ అన్ని భాషలవారూ కమిషన్ ప్రతిపాదనలను, మారుమాట చెప్పక అంగీకరించాలని ఇటీవల పదే పదే విజ్ఞాపనలు చేస్తున్నారు. క్రిందటివారం ఢిల్లీలో జరిగిన ప్రదేశ కాంగ్రెసు కార్యకర్తల సమావేశంలో కూడా ఈ విషయం మీదనే పండిట్ పంత్ ఎక్కువగా మాట్లాడారు. ఫజల్ అలీ కమిషన్ నివేదికను ప్రజలు అంగీకరించేటట్లు చేయాలని ప్రత్యేకంగా విజ్ఞప్తిచేశారు. పండిట్ పంత్ విజ్ఞాపనలవల్ల ఫజల్ అలీ కమిషన్ ప్రతిపాదనలు అందరికీ అసంతృప్తికరంగానే వుండగలవనే అభిప్రాయం కల్గింది. ఎవరికీ పూర్తిగా తృప్తికరంగా లేనప్పుడు ఆ ప్రతిపాదనలు న్యాయ సమ్మతంగా వుండగలవనే భావం ప్రభుత్వానికి వుండవచ్చును. ఏ సమస్యకైనా సర్వజనసమ్మతమైన పరిష్కారం సాధ్యంగాదు. అల్ప సంఖ్యాకులకు రక్షణ కల్గిస్తూ అధిక సంఖ్యాకులకు తృప్తికరంగా వుండే పరిష్కారాన్ని సాధించడం ప్రజాస్వామిక సూత్రబద్ధమైన పద్ధతి.

ఫజల్ అలీ కమిషన్ ప్రతిపాదనలు ఇంచుమించు థార్ కమిషన్ ప్రతిపాదనలనే ప్రతిబింబస్తవనే భావం కలగడానికి పండిట్ పంత్ విజ్ఞాపనలు ఆంధ్ర ముఖ్యమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు హైద్రాబాద్‌లో చేసిన ప్రసంగం దోహదం చేసినవి. ఫజల్ అలీ కమిషన్ హైద్రాబాదు రాజధానిగా ప్రత్యేక తెలంగాణా రాష్ట్రాన్ని ఏర్పరచాలని సూచించినట్లు శ్రీ గోపాలరెడ్డిగారు వెల్లడించారు. ముందుగా నేను ఈ "రహస్యాన్ని" బయటపెట్టివేయడం ఉచితమా, అనుచితమా అనే విషయాన్ని ఫజల్ అలీ కమిషన్ కేంద్రప్రభుత్వం నిర్ణయించవలసివుంటుంది. శ్రీ గోపాలరెడ్డిగారి ప్రసంగం కేవలం విశాలాంధ్రకుమాత్రమే పరిమితమై లేదు. వారు వెల్లడించిన విషయాల వల్ల ఈ సంవత్సరాంతంలోగానో లేక 1956 ఆర్థిక సంవత్సరారంభానికి ముందుగానో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘ ప్రతిపాదనలు అమలు జరిగేటట్లు కన్పిస్తుంది. వచ్చే ఎన్నికల లోపునే సంయుక్త కర్నాటక రాష్ట్రం ఏర్పడుతుందని శ్రీ గోపాలరెడ్డిగారు సూచించారు.

అయితే గోపాలరెడ్డిగారు తెలిపిన వివరాలవల్ల ఫజల్ అలీ కమిషన్ నివేదికలో కొన్ని అసంబద్ధమైన సూచనలున్నట్లు కన్పిస్తున్నది. మొత్తం పదహారు లేక పదిహేడు రాష్ట్రాలు ఏర్పడనున్నట్లు, చిన్న చిన్న రాష్ట్రాలు అంతరించనున్నట్లు ఆంధ్ర ముఖ్యమంత్రి తెలిపారు. చిన్న రాష్ట్రాలు అంతరించనున్నప్పుడు ఎనిమిదిజిల్లాలతో తెలంగాణా రాష్ట్రాన్ని ఏర్పరచాలని ఫజల్ అలీ కమిషన్ ఎలా సిఫార్సుచేస్తుందో తెలియదు. విశాలాంధ్ర విషయంలో ఎన్నికలద్వారా ప్రజాభిప్రాయాన్ని సేకరించాలని, తదనుగుణంగా విశాలాంధ్ర నిర్మాణంపై తిరిగి నిర్ణయం జరగాలని అభిప్రాయపడిన కమిషన్ సంయుక్త కర్నాటక నిర్మాణం విషయంలో అలాంటి ప్రజాభిప్రాయ సేకరణ అవసరం లేదని ఎలా భావించిందో తెలియదు.

విశాలాంధ్ర నిర్మాణ సందర్భంలో ప్రధానంగా పరిగణింపవలసింది తెలంగాణా ప్రజల అభిప్రాయాలే. కాని విశాలాంధ్రను ఎన్నికల సమస్యగా చేయడం ఎంతవరకు వాంఛనీయం అన్నది కమిషను సభ్యులు, కేంద్ర ప్రభుత్వం, హైద్రాబాదు, ఆంధ్ర ప్రభుత్వాలు విచారించవలసిన విషయం. ఆంధ్రరాష్ట్ర సమస్య ఎన్నికల ప్రణాళికాంశం కారాదని అభిప్రాయపడిన ఆంధ్ర నాయకులు విశాలాంధ్ర ఎన్నికలలో పరిష్కారం కావాలనే ప్రతిపాదనను ఎలా అంగీకరిస్తారో చూడవలసివున్నది.

ఆంధ్ర ముఖ్యమంత్రి ముందుగా ఈ విషయాన్ని వెల్లడి చేయడంవల్ల విశాలాంధ్రకు అనుకూలంగా, ప్రతికూలంగా ఇప్పట్నుంచే ఆందోళన ప్రారంభమై, అవాంఛనీయమైన సంఘటనలకు దారితీయవచ్చును. అయినా ఒకవైపున కేంద్ర ప్రభుత్వ దేశాంగ వ్యవహారాలమంత్రి పండిట్ పంత్ ప్రజలు, అన్ని భాషలవారు, అన్ని రాష్ట్రాలవారు మౌనంగా ఫజల్ అలీ కమిషను సిఫార్సులను ఆమోదించాలని విజ్ఞప్తి చేస్తూ మరొకవైపున విశాలాంధ్రవిషయంలో ఒక సంవత్సరం అన్ని సంగతి సందర్భాలు విచారించి తెలంగాణా, ఆంధ్రరాష్ట్ర ప్రజలు తమ అభిప్రాయాన్ని వెల్లడించాలని కోరడం చిత్రంగా వుంది.

అప్పుడే విశాల హైద్రాబాదు నగరాన్ని ఏర్పరచాలనే ఉద్యమం ప్రారంభమైంది. క్రమంగా ఈ హైద్రాబాదు నగరం, బొంబాయి, న్యూఢిల్లీ లాగా ప్రత్యేక ప్రాంతాలుగా ఏర్పడవచ్చును. అంతేగాదు. తెలంగాణా ప్రత్యేకరాష్ట్రంగా వుంటే, ఆ రాష్ట్రానికి హైద్రాబాదు రాజధానిగా వుండవచ్చునని, విశాలాంధ్ర ఏర్పడితే హైద్రాబాదు ప్రత్యేక నగరంగా ఏర్పడవచ్చునని ఫజల్ అలీ కమిషన్ ప్రతిపాదనల అంతరార్థమై వున్నట్లు కన్పిస్తుంది. ఫజల్ అలీ కమిషన్ నివేదిక నెలరోజుల్లో వెలువడనున్నది. అంతవరకూ ఆంధ్ర ముఖ్యమంత్రి ఈ విషయాన్ని వెల్లడించకుండా వుంటే ప్రయోజనకరంగా వుండేది. ఏమైనా ఈ ప్రతిపాదనలపై త్వరపడి ఆందోళన ప్రారంభింపక, ప్రశాంతంగా వ్యవహారంచేయడం చాలా ముఖ్యం.

## భారతరత్న బిరుద ప్రదానం

(1 వ పేజీ తరువాయి)

యిటీవలనే విరమించారు. భాక్రా ప్రాజెక్టు జనరలు మేనేజరుగా వున్న శ్రీ యస్. డి. ఖున్ రెండవవారు. మద్రాసురాష్ట్ర మాజీ చీఫ్ ఇంజినీరు శ్రీ ఎ. ఆర్. వెంకటాచార్య మూడవవారు. దక్షిణ భారతములో ఇప్పటివరకు అరు సకలార్థసాధక నిర్మాణాలను రూపొందించడంలోను, నిర్వహించడంలోను ఆయన తోడ్పడ్డారు.

వైద్యం, వైజ్ఞానికరంగాలకు చెందినవారిలో ఇద్దరు వైద్యప్రముఖులకు, ఒక సాంకేతిక శాస్త్రజ్ఞునికి పద్మభూషణ్ బిరుదు లభించింది. కలకత్తాకు చెందిన డాక్టర్ యల్. యమ్. బెనర్జీ ఒకరు. ఆయన శస్త్రచికిత్సలోను, వ్యాధుల చికిత్సలోను నిపుణులు. బొంబాయి కేన్సర్ ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన డా॥ వి. ఆర్. ఖానోల్కర్ రెండవవారు. పుండు, కుష్టువ్యాధుల నివారణలో ఆయన చేసినకృషి ప్రశంసనీయమైనది. ప్రముఖ సాంకేతిక శాస్త్రజ్ఞుడు, శాస్త్రవేత్త ఆచార్య యస్. యస్. భాకర బెంగుళూరు సైన్సు ఇన్‌స్టిట్యూట్ అభివృద్ధికి తోడ్పడ్డారు.

ఈ బిరుదుపొందిన మిగతావారు: నిర్వాసితుల పునరుద్ధరణకు, కుటీర పరిశ్రమల అభివృద్ధికి విశేషంగా తోడ్పడిన శ్రీమతి కమలాదేవిఛటోపాధ్యాయ, హరిజనోద్ధరణకు కృషి చేసిన శ్రీమతి రామేశ్వరి నెహ్రూ, సమాజాభివృద్ధి కార్యక్రమాల నిర్వహణాధికారి శ్రీ యస్. కె. డే, "ఆంధ్ర పితామహ" శ్రీ మాడపాటి హనుమంతరావు.

### పద్మశ్రీ

పద్మశ్రీబిరుదుపొందినవారుపదముగ్గురు ప్రముఖులు: గౌహతి విశ్వవిద్యాలయం ఉపాధ్యాయుడు, సాహిత్యవేత్త శ్రీకృష్ణ కాంతహండి ఒరిస్సా రాష్ట్రానికి చెందిన శ్రీ లక్ష్మీనారాయణ్ సాహూ వివిధ విషయాలపై గ్రంథాలను రచించారు. కాశీ సంగీత కళాశాల ప్రధానాధ్యాపకులు పండిత ఓంకార్‌నాథ్ ఠాకూర్, శాస్త్రీయ సంగీత పురోభివృద్ధికి ప్రశంసనీయమైన కృషిచేశారు. స్వతహాగా ఆయన మేటి గాయకుడు. పూనాలోని హైడ్రాలిక్ పరిశోధన కేంద్రానికి చెందిన శ్రీ డి. వి. జోగ్లేకర్, కేంద్ర ఆరోగ్యశాఖకు చెందిన డాక్టర్ పి. వి. బెంజమన్ క్షయవ్యాధి నిరోధక చర్యలను ప్రశంసనీయంగా అమలుజరపడానికి బాధ్యుడు. న్యూఢిల్లీకి చెందిన డాక్టర్ సిద్ధ-నా క్‌కల్, సుప్రసిద్ధ కంటి వైద్యుడు; రెండు సంవత్సరాలుగా శ్రీ గంగారామ్‌ప్రొఫ్ కంటి వైద్యశాలలో ఉచితంగా చికిత్సలు చేస్తున్నారు. డాక్టర్ మహేశ ప్రసాద్ మెహ్రే; ఉత్తరప్రదేశ్‌లోని సీతాపూరు కంటి వైద్యశాల స్థాపకులు. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్రవ్యాప్తంగా అమలు జరిపిన కంటి చికిత్స పథకం ఆయన ఆధిపత్యం క్రింద నిర్వహించబడుతున్నది. మదరాసుకు చెందిన శ్రీమతి మేరీ క్లబ్‌వాలా, సుప్రసిద్ధ సంఘ సేవిక జైపూర్‌కు చెందిన శ్రీమతి రతన్‌శాస్త్రి, బాలికల విద్యాభివృద్ధికి జైపూరులో బనస్థలి విద్యాపీఠాన్ని స్థాపించారు. పుదుచ్చేరి చీఫ్ కమిషనర్ శ్రీ కేవల్ సింగ్ చౌదరి.

ప్రముఖ శిల్పశాస్త్రవేత్త శ్రీ హబీబుర్ రహిమాన్, కలకత్తాలోని గాంధీ ఘాట్ నిర్మాణానికి నమూనాను తయారు చేశారు. భారతప్రభుత్వ విదేశ వ్యవహారాలశాఖకు చెందిన శ్రీ హుమాయూన్ మిర్జా; కేంద్ర ప్రభుత్వ కార్యాలయం లోపల భాగాన్ని అందంగానూ, ఆకర్షణీయముగాను అలంకరించారు. (వీరు బోగడ బనగానపల్లె దివాన్‌గా పనిచేశారు.) విశాల బొంబాయిలోని హోంగార్డ్సు కమాండెంటు శ్రీ ఎమ్. జె. మాసెక్, అనేక విషయాలలో ఆసక్తిగలవాడు.

### వేతనాల శాసనం

న్యూఢిల్లీ సెప్టెంబరు 6: వేతనాల చెల్లింపు శాసనాన్ని కొత్తగా ఏ యే వ్యాపారాలకు వర్తింపచేయాలో అన్నది త్వరలోనే నిర్ణయింపబడుతుందని కార్మికమంత్రి శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ఇవ్వాళ లోక్‌సభలో తెలియచేశారు. ఇందుకోసం శాసనాన్ని సవరించే వుద్దేశం కూడా వున్నదని ఆయన న్నారు.

# మహామేధావి గోరిన్

### ఇగర్ గౌజెంకో

చివరికి వారు ఇద్దరూ కలుసుకొన్నారు. వారిద్దరి చూపులూ కలుసుకొన్నవి అని చెప్పడం వాస్తవానికి సన్నిహితంగా వుంటుంది. ప్రొఫెసర్ ఫీయొడోర్ నొవికోవ్‌ను కలుసుకొనడానికి డ్రాడ్జ్ అక్కడ ఒకబల్లమీద కూర్చున్నాడు. ఇంతలో ఒక స్త్రీ చంకలో పిల్లని ఎత్తుకొని ఎక్కడా చోటు లేనట్టు వచ్చి డ్రాడ్జ్‌పక్కనే కూర్చున్నది. డ్రాడ్జ్ వెంటనే అక్కడ్నుంచి లేచాడు. చాటుగా ప్రొఫెసర్ నొవికోవ్‌కు సంజ్ఞచేసి ముందుకు సాగాడు. ప్రొఫెసర్ నొవికోవ్ అతన్ని అనుసరించడానికి వీలుపడలేదు. రాస్తావ్ విశ్వవిద్యాలయ విద్యార్థులు ఇద్దరు ప్రొఫెసర్ నొవికోవ్‌ను చూచారు. కబుర్లు ప్రారంభించారు. డ్రాడ్జ్ దూరంగా నిలబడి ఏదో పత్రికచూస్తున్నాడు. అతని మనస్సు పత్రికమీదలేదు. పత్రికను కేవలం ముఖానికి అడ్డంపెట్టుకు నిలబడ్డాడు. ప్రొఫెసర్ నొవికోవ్ ఆ విద్యార్థుల్ని వదిలించుకు వచ్చేవరకూ డ్రాడ్జ్ అలా నిలబడే వున్నాడు.

ఎలాగో ఇద్దరూ అక్కడ్నుంచి బయల్దేరారు. డ్రాడ్జ్ ముందు నడుస్తున్నాడు. ప్రొఫెసర్ నొవికోవ్ నీడలాగా వెంటపడుతున్నాడు. ఇద్దరూ డాన్ నది అభిముఖులై అలానడిచారు. నదినిచేరి నదిఒడ్డునే పోయారు. రాస్తావ్ పొలిమేర దాటారు. వీరిద్దరూ తప్ప ఇతరులు ఎవ్వరూ లేరు. అప్పుడప్పుడు సముద్రపు కొంగలు మాత్రం వీరిఏకాంతానికి భంగంకలిగిస్తూ వున్నవి. డ్రాడ్జ్ నడిచి నడిచి ఆఖ్టె నీరులేని ఒకవాగును చేరాడు. ఎటుచూచినా పొదలు; గుబురు గుబురుగా చెట్లు. ప్రాణాలు తీయడానికిగాని, ప్రాణాలు తీయించడానికిగాని అన్నివిధాలా అనుకూలమైన ప్రదేశం. డ్రాడ్జ్ అలా నిలబడి 'త్వరగారా' అన్నట్లు ప్రొఫెసర్ నొవికోవ్‌కు సంజ్ఞచేశాడు.

"మనం మొదట ఎన్నుకొన్న చోటు ఎంతమాత్రం అనుకూలంగా లేదు" అన్నాడు డ్రాడ్జ్, కొంతచిరాకు కనబరుస్తూ.

"అవును. నిజమే. అక్కడ నన్ను తెలిసినవారు చాలామంది వున్నారు." అన్నాడు ప్రొఫెసర్ నొవికోవ్ డ్రాడ్జ్‌తో ఏకీభవిస్తూ. ప్రొఫెసర్ నొవికోవ్ ఈ సమాధానంచెప్తూ డ్రాడ్జ్ ముఖ కవళికలను పరీక్షగా చూచాడు. సరిగ్గా తను అనుకున్నట్లే వుంది డ్రాడ్జ్ ముఖం. రసహీనంగా వుంది. కొంత తీక్షణం కూడా కన్పించింది. ఉల్లాసం గాని ఉద్రేకంగాని ఏకోశానా కన్పించదు ఆ ముఖంలో. కొంత వెక్కిరిస్తున్నట్లు కొనలు తిరిగివున్నవి అతని పెదిమెలు మాత్రం. ఆ పెదిమలే అతని పట్టుదలను వెల్లడిచేస్తున్నవి.

పార్టీ సేవకులలో అతని స్థాయి సామాన్యం అయినది అని అనుకోవచ్చును. అతని ముఖంలో సహజంగా పదవుల్లో వుండేవారి ముఖంలో వుండే కాఠిన్యం వుంది. ఆ కాఠిన్యానికి కొంత అసాధారణమైన అధికారదర్పం జత అయింది. ఇతను ఆదేశాలు ఇవ్వడానికి అలవాటుపడిన వాడేగాని వాద ప్రతివాదాలంటే ఇష్టపడే వాడుకాడు అనే భావం అతన్ని చూచీచూడగానే కలుగుతుంది.

ప్రొఫెసర్ నొవికోవ్‌ను కలుసుకొన్న తర్వాత డ్రాడ్జ్ ఒక్కక్షణం కూడా వృధాచేయలేదు. ఈ రహస్య ప్రదేశానికి నొవికోవ్‌ను పిలుచుకు రావడానికి కారణం ఏమో వెంటనే వివరించేశాడు. "రైలు దిగి సరాసరి వచ్చాను. నాకు ఇక్కడ ఇతర పనులు ఏమీలేవు. నీతో మాట్లాడడం అయితే మరొకర్ని మాత్రమే చూడవలసి వుంటుంది. అది పూర్తికాగానే రేపే తిరిగి మాస్కో వెళ్ళిపోతాను. మనం ఇప్పుడు మాట్లాడే విషయం నీకూ నాకూ మాత్రమే తెలుసు. మూడవ ప్రాణికి తెలియదు. తెలియరాదు. బోధపడిందా?" అని డ్రాడ్జ్ సంభాషణ ప్రారంభించాడు.

సిగరెట్ ముట్టించి డ్రాడ్జ్ ఉపన్యాసం సాగించాడు. నీ పని చాలా కష్టమైనది; క్లిష్టమైనది. ఎంతో బాధ్యతాయుతము అయినది. నీవు ఏమీ తెలియని, అనుభవంలేని అమాయకుడవుకావు. నాకు తెలుసును. నీవు ఇదివరలో మాతో కలిసి పనిచేసినవిషయం నేను మరిచిపోలేదు. అయితే ఇదివరకు నీవు చేసినది అంతా ఒక ఎత్తు. ఇప్పుడు చేయబోయేది అంతా ఒకఎత్తు. నీ వల్ల ఇప్పుడు కావలసినపనిముందు నీవల్ల ఆయినపనులు దిగదుడుపుకుకూడా పనికిరావు. అవి కేవలం పిల్లల ఆటలే. నీవు వ్యవహారం చేయవలసిన వ్యక్తి సామాన్యుడుకాదు."

"ఎవరాతడు?" నొవికోవ్ అడిగి వేశాడు.

"రచయిత మైఖేల్ గోరిన్," అని సమాధానంఇస్తూ ఈ పేరు వినేసరికి ప్రొఫెసర్ నొవికోవ్‌లో ఏ భావోద్రేకాలు కలుగునో అని డ్రాడ్జ్ అతన్ని పరీక్షగా చూచాడు.

"రచయిత మైఖేల్‌గోరిన్! అతనికి ఏం జరిగింది? గోరిన్ ఏమైనాడు?" విభ్రాంతుడై, సంభ్రమాశ్చర్యాలలో అడిగాడు నొవికోవ్. ఇతలో అవసరం ఏర్పడిందీ అంటే గోరిన్‌కు ఏదో జరిగివుండాలి అని ప్రొఫెసర్ నొవికోవ్ తన అనుభవాన్ని బట్టి ఊహించుకొన్నాడు. ప్రొఫెసర్ నొవికోవ్ విస్మయంలో కపటం ఏమీలేదు. గోరిన్ గొప్ప రష్యన్ రచయిత! 'సోవియట్ సాహిత్య, వాఙ్మయ జనకుడు' అని పార్టీ అతన్ని అభివర్ణించింది. ప్రపంచంలోని అన్ని భాషల్లోకి అతని రచనలు తర్జుమా అయినవి. ఒక పురుషాంతరానికి చెందిన క్రొంతకారులు రష్యాలోనూ, రష్యా వెలుపలా గోరిన్ గ్రంథాలు చదివి పైకి వచ్చారు. అతని భావాల్లోనుంచి వారు ఉద్భవించారు. అతడు లెనిన్‌కు ఆప్తమిత్రుడని, లెనిన్ అనంతరం స్టాలిన్‌కు కూడా అతడు సన్నిహిత స్నేహితుడని అందరికీ తెలుసు. కనీసం సోవియట్ పంచాంగాలన్నీ ఈ విధంగా ఘోషించినవి. అసంభవం; గోరిన్‌కు ఏదో జరిగింది అంటే నమ్మడం కష్టం. ఇదంతా ఏదో చమత్కారంగా, పరాచికంగా వుంది!

డ్రాడ్జ్ ముఖంచూస్తే అతను హాస్యమాడుతున్నాడని నమ్మడం సాధ్యంకాదు. ఆ విషయం స్పష్టంగా కన్పిస్తూనేవుంది. "గోరిన్ అతని అభిప్రాయాలను, మనోగత భావాలను వెళ్లగక్కడానికి సన్నద్ధుడు అవుతున్నాడని పొలిట్ బ్యూరోకు తెలియవచ్చింది. సమిష్టి సేద్యాన్ని కఠినంగా అమలు జరపాలని పార్టీ నిశ్చయించింది. తదనుగుణంగా చర్యలు తీసుకున్నది. అప్పట్నుంచీ గోరిన్ ఈ ప్రభుత్వ విధానం అంటే తనకువున్న అసంతృప్తినీ, ఆగ్రహాన్నీ తన అంతరంగికులకు తెలియజేశాడు. ఈ సంఘటనలనుపార్టీ అలక్ష్యం చేయలేదు. చూసీ చూడనట్టు వూరుకోలేదు. ఏదో అనామకులు, చిల్లర మల్లరవాళ్లు అరవడం, హడావిడీ చేయడం వేరు. వాళ్ల నోళ్లు మూయించవచ్చు; వారిమాట వినిపించకుండా చేయవచ్చు. కాని గోరిన్ లాంటి అజరామరుడు ఆందోళనచేస్తే ప్రభుత్వం గమనించి తీరాలి. ఆ విషయంలో ఏదోచేసి తీరాలి"

"ఒక్క ముక్కలో చెప్తాను. ఇంతవరకూ గోరిన్ పొలిట్‌బ్యూరోపక్షం వున్నాడు. ఇక ముందుకూడా అలాగే పొలిట్‌బ్యూరోపక్షం వుండేటట్లు చేయాలి. పొలిట్ బ్యూరో ఇప్పుడు తలపెట్టినపని ఇదే. వర్తమానపరిస్థితి విషమంగా వుంది. ఇప్పుడు గోరిన్‌పార్టీ విధానాన్ని సమర్థిస్తూ మాట్లాడితే ఆ మాటలకు దేశంలోనే కాదు, దేశం బయటకూడా ఎంతో విలువ వుంటుంది. గోరిన్ కారుణ్యం, మానవత్వం జగత్ప్రసిద్ధం. ఈనాడు మనం బ్రతకడానికి గాలి ఎంత అవసరమో మానవత్వంకల మహామనుజుని మాట అంత అవసరం. గోరిన్‌చేత ఈ మాట అనిపించాలి. అదే నీ పని." డ్రాడ్జ్ ఈ ఆఖరు వాక్యాలను కొంత నొక్కిపలికాడు. అవి తన మాటలుకావని, పైవారి అభిమతం అది అనీ నొవికోవ్‌కు స్ఫురింపచేయడమే అలా నొక్కి చెప్పడంలో డ్రాడ్జ్ ఉద్దేశం.

ఈ ఆకస్మిక సంఘటనకు, తలవని తలంపుగా జరిగిన దీనికి నొవికోవ్ నిజంగా వొణికిపోయాడు. "ఇంత పని నేను చేయకలుగుతానని మీకు ఏమిటి విశ్వాసం?" అన్నాడు విపరీతమైన ఆందోళనతో. "గోరిన్‌ను మాట్లాడించడం, గోరిన్‌ను మార్చడం" ఈవిధంగా అనడమే మహా కష్టంగావుంది.

డ్రాడ్జ్ ఒక్క నిమిషం ఊరుకొన్నాడు. "ఈ పని నీవల్లతప్ప మరెవరివల్లా కాదని మా అభిప్రాయం" అని విషయం తేల్చివేశాడు డ్రాడ్జ్. 'ఈమాటలకి తిరుగు లేదు' అన్నట్టు గట్టిగా చెప్పాడు. ఈ ధోరణి నొవికోవ్‌కు కూడా దుర్భరమైంది.

"ఇదేమిటి ఖర్మం! నాకు అసలు గోరిన్‌తో పరిచయంకూడా లేదు" అని అధిక్షేపణ సూచకంగా అన్నాడు నొవికోవ్.

"అక్కడేవుంది నీ అవకాశం. అదే నీకు మంచి వీలు. అపరిచితులవల్లనే పని అవుతుంది. కొత్త మనుష్యులు—కొత్త భావాలు. చిరపరిచితులవల్ల చిన్న మెత్తు ప్రయోజనం లేదు. నొవికోవ్ దీనికి ఏదో అభ్యంతరం చెపుతూవుంటే డ్రాడ్జ్ అతని మనస్సును గ్రహించినట్లు ఇలా అన్నాడు. "నాకు తెలుసు. నేను గ్రహించాను. గోరిన్‌తో పరిచయంకావడం ఎలాగా అని నువ్వు సంభ్రమం చెందుతున్నావు. అవన్నీ ఇదివరకే సర్దుబాటు అయినవి. గోరిన్ స్నేహితులలో ఒకరు మనకు మంచి నేస్తం." అంటూ డ్రాడ్జ్ మందహాసం అభినయించాడు. "ఆ మననేస్తం నిన్ను గోరిన్‌కు పరిచయం చేస్తాడు. నిన్ను తీసుకుపోయి గోరిన్ యింట్లో ప్రవేశపెడతాడు. ఆ క్షణంనుంచీ నువ్వు నీ తెలివి తేటలు ఉపయోగించుకోవాలి."

డ్రాడ్జ్ తీక్షణంగా, కళ్లార్పకుండా నొవికోవ్‌ను చూస్తున్నాడు, నొవికోవ్ ఆ దృష్టిని భరించలేక పోయినాడు. స్వతంత్రంగా ఆలోచన చేయుకల శక్తిని కోల్పోయినాడు. భరించలేక ముఖం తిప్పేసుకొని నదివంక చూస్తూ కూర్చున్నాడు.

అగాధమై, దరికానని డాన్ నదీజలాల సలహా పొందుతున్న నొవికోవ్‌ను క్రీగంటచూస్తూ డ్రాడ్జ్ అతన్ని పరీక్ష చేస్తున్నాడు. తనకంటె పొడగరి నొవికోవ్. అయినా తనకంటె చిన్న. నొవికోవ్ వయస్సు 30 సంవత్సరాలే అని డ్రాడ్జ్‌కు తెలుసును. పల్చని ముఖం. మంచి అంగసౌష్టవం. వెడల్పు అయిన బుజాలు. బుగ్గలు, చెక్కిళ్లు కొంచెం పీక్కుపోయినట్లు కన్పించినా అందువల్ల అతని చూపులో కొంత కళ ఏర్పడింది. అతని శిరస్సు కొంత బల్లపరుపుగా వుంటుంది. జుట్టు బాగా వొత్తుగా వుంటుంది. మనిషి చూట్టానికి అందంగా వుంటాడు. డ్రాడ్జ్‌ను ఆకర్షించిందిఅతని అందచందాలు కానేకావు. ఎత్తుగా వున్న అతని నుదురు, ఆ నుదురుక్రింద ఉక్కురంగులోవున్న ఆ నేత్రద్వయం. నూటికి నూరుపాళ్లు నాటకీయంగా కృత్రిమం అనేదిలేక, కారుణ్యాన్ని విరజిమ్ముతూ అతని తెలివి తేటలను వెల్లడిస్తూ వున్నవి ఆ రెండుకళ్లూ.

'అతని చూస్తే చాలును'అనుకున్నాడు డ్రాడ్జ్. సరియైన మనిషిని పట్టాననే నమ్మకం కల్గిందతనికి. "తెలివైనవాడు. కాని వినమ్రుడు. సాహసం వుంది. తొందరపాటులేదు. సరిగ్గా ఈ పనిని సాధింప అన్నివిధాలా అర్హుడైన వాడు."

డ్రాడ్జ్ ఊహలకు సమాధానం చెప్పినట్లు "సరే! నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. ఫలితాన్ని గురించి పూచీపడలేను" అన్నాడు ప్రొఫెసర్ నొవికోవ్.

డ్రాడ్జ్‌కు పని సానుకూలమైంది. నింపాదిగా, నొవికోవ్‌కు వచ్చు చెప్తూ, ఇలా అన్నాడు: "విజయం తప్పదు. పని అయి తీరాలి. అలా కావడం నీకు శ్రేయస్కరం. లాభదాయకం. పొలిట్ బ్యూరో, కామ్రేడ్ స్టాలిన్ కూడా ఈ పని జయప్రదం కావాలి అని స్వయంగా వాంఛిస్తున్నారు. ఇది పరమ రహస్యం అయిన ప్రభుత్వ వ్యవహారం." అప్పటికే డ్రాడ్జ్ సంతోషం పట్టలేకుండా వున్నాడు. నవ్వుతూ "ఈ వ్యవహారంలో నువ్వు విజయుడవు అయినావో నిన్ను చూచి నేను అసూయ పడక తప్పదు."

"మరి నేను విఫలమైతే?" అని నొవికోవ్ అనుకుదామనుకున్నాడు. నాలిక చివరిదాకా వచ్చినవి మాటలు. కాని డ్రాడ్జ్‌ను ఆ మాట అడుగలేదు. తను వేయబోయిన ప్రశ్నకు సమాధానం తనకే తెలుసును.

## 2 వ అధ్యాయము

రష్యా ప్రజలకు అవి మహా గడ్డు రోజులు. వారి అభిమతానికి విరుద్ధంగా స్టాలిన్ సమష్టి వ్యవసాయాన్ని అమలుజరుపుతూ వున్నాడు. లక్షలాది రైతులు, కూలీలు పడరానిపాట్లు పడుతున్నారు. సమష్టి వ్యవసాయ విధానం అమలు కావడమువల్ల ప్రజా సామాన్యం అనుభవిస్తున్న బాధలు, చరిత్రలోమరెక్కడా కన్పించవు. ఆ ప్రజల దైన్యం, వారి విషాదస్థితి, వారి దుఃఖం, ప్రపంచంలో మరి ఎవ్వరూ, ఏ నాడూ అనుభవించి వుండలేదు. మానవాత్మపై ఇది మాయని మచ్చగా, తీరని కళంకముగా శాశ్వతంగా వుండిపోతుంది. ఈ విధానం వల్ల ఎందరో తిండిలేక మలమలమాడి మరణిస్తున్నారు. మరెందరో తుపాకీ కాల్పులకు ఆహుతి అవుతున్నారు. ఇంకా ఎందరో సహింపరాని అవమానాలను, భరింపరాని బాధలను అనుభవింప వలసిన వారైనారు. సైబీరియా శిబిరాల్లో ఎందరో మగ్గిపోతున్నారు. లక్షలాది ప్రజలలో అపరాధులు ఒక్కరు లేరు. అందరూ వట్టి అమాయకులు. సత్యకాలపువారు.

ప్రజలు ఈవిధంగా యమయాతనపడుతూ వుంటే సోవియట్ మేధావులందరూ ప్రజాజీవితం ఆనందమయమై, సుఖప్రదమై వున్నట్లు చిత్రిస్తున్నారు. ప్రభుత్వం అమలుచేస్తున్న అమానుష చర్యలను సమర్థిస్తున్నారు. కార్మిక కర్షకులు క్షుద్బాధలకు తాళలేక కృశించిపోతూ వుంటే వారి సంరక్షణబాధ్యత తను స్వీకరించాడని స్టాలిన్‌కు ఈ మేధావులు సోవియట్ ప్రజానీకం తరఫున కృతజ్ఞతను ప్రకటిస్తున్నారు.

ప్రభుత్వ కొరడా క్రింద సోవియట్ మేధావులందరూ ప్రభుత్వ పాటకు చిందులేస్తూ, అధికారులకు వింజామరలు వీస్తూ, వినమ్రులై వుంటే మైఖేల్ గోరిన్ కంఠధ్వని ఎక్కడా విన్పించడంలేదు. వేలాది మేధావుల స్తోత్రపాఠాలు గోరిన్ స్వరం లేకపోయేసరికి నిరూపయోగ్యమైపోయినవి.

సోవియట్ రచయితలలో గోరిన్‌కు ఒక విశిష్టస్థానం వున్నది. ఈ రచయితలు అందరూ తమ ఔన్నత్యానికి, తమ విజయాలకు సోవియట్ ప్రభుత్వానికి అపారంగా ఋణపడివున్నారు. గోరిన్ అలాకాదు. స్వయంశక్తిమీదనే గోరిన్ అద్భుత విజయాలను, అపారమైన కీర్తిప్రతిష్ఠలను సంపాదించుకొన్నారు. కాగా సోవియట్ ప్రభుత్వమే గోరిన్‌కు ఎంతో ఋణపడివున్నది. విప్లవానికి పూర్వమే, రష్యాలో బోల్షివిక్కు ప్రభుత్వం ఏర్పడ్డానికి పూర్వమే గోరిన్ గొప్పరచయితగా పేరొందాడు. గోరిన్‌కు బాగా కావలసిన సహచరులలో, అతని పరమ ఆప్తులలో తను ఒకడ్ని అని చెప్పుకోగలగడమే ఘనతగా, గౌరవంగా భావించాడు లెనిన్. లెనిన్ అనంతరం స్టాలిన్ కూడా ప్రజల్లో అదే అభిప్రాయం కల్గించడానికి ఎంతగానో ప్రయత్నించాడు. గోరిన్‌తో కలిసి స్టాలిన్ తీయించుకున్న ఫొటోలకు ఎంత ప్రచారం జరిగిందో చెప్పలేం.

ఫొటోల్లో వారి శరీరాలు ఎంత సన్నిహితంగా వున్నవో జీవితంలో వారిద్దరూ అంత సన్నిహితంగానూ వున్నారు అని ప్రజలు విశ్వసించేటట్లు చేయడానికి స్టాలిన్ చేయని పనిలేదు. ఫొటోగ్రాఫులు అయిపోయినప్పుడు చిత్రకారులకు చేతినిండా పని కలిగింది. జోసెఫ్ స్టాలిన్, మైఖేల్ గోరిన్ కరచాలనం చేస్తున్నట్టు, పరస్పరంఎంతో విశ్వాసం కలిగివున్నట్టు, ఇద్దరూ ఎంతో ఆత్మీయులుగా వున్నట్టు బొమ్మలు వేసి ఫొటోగ్రాఫులు లేని కొరత తీర్చారు. గోరిన్ తన కవితను చదువుతూ వుంటే కామ్రేడ్ స్టాలిన్, కామ్రేడ్ వొరొషిలావ్, ఎంతో శ్రద్ధగా వింటూవున్నట్టు చిత్రించిన చిత్రపటాన్ని ట్రెట్యకోవ్ చిత్రశాలలో వుంచారు. ఈ చిత్రపటం విలువను, ప్రయోజనాన్ని స్టాలిన్ గ్రహించినంతగా మరెవ్వరూ గ్రహించలేదు. స్టాలిన్ ఆదేశాన్ని అనుసరించే ఈ చిత్రపటం ట్రెట్యకోవ్ చిత్రశాలను అలంకరించడం ఈ చిత్రపటం ప్రతులు లక్షలు లక్షలు ప్రజలకు వుచితంగాపంచిపెట్టడం జరిగింది.

ఇదంతా ఎందుకు జరిగిందో తెలుసుకోవడం కష్టం కాదు. గోరిన్ పేరు మానవత్వానికి, కారుణ్యానికి పర్యాయ పదమైంది. కురూపిస్త్రీ ముఖానికి పౌడర్ ఎంత అవసరమో నిరంకుశుడైన స్టాలిన్‌కు కారుణ్యమూర్తి గోరిన్ అంత అవసరం.

ఈ మధ్యవరకూ, మొన్న మొన్నటిదాకా గోరిన్ స్టాలిన్ స్నేహాన్ని తృణీకరించలేదు. స్టాలిన్‌ను అపహ్యాసించుకోలేదు. స్టాలిన్ ప్రతి ఒక్క పని సదుద్దేశంతోనే మంచికే చేస్తున్నాడని గోరిన్ నమ్ముతూ వచ్చాడు. అతనికి అనుమానం అనేది లేదు. ఈ విషయంలో దేశంలో అఘాయిత్యపుపనులు కొన్ని జరుగుతూ వున్నవనీ, అనేక అక్రమాలు జరుగుతూ వున్నవనీ ఎవరెవరో వచ్చిగోరిన్ చెవిని వేసిపోతూనేవున్నారు. గోరిన్ ఈ మాటలను నమ్మలేదు. చారిత్రాత్మకమైన, ఈ మహాద్భుత పరివర్తనను కానలేనిమేధావులు భయభ్రాంతులై వేసే కేకలుమాత్రమే యివి అనిగోరిన్ నమ్ముతూ వచ్చాడు. వీరు దేశములో వస్తున్న మార్పులను పరిపక్వమౌతున్న విప్లవాన్ని నిష్కామ దృష్టితో పరిశీలింపలేకుండా ఉన్నారని అనుకున్నాడు. గోరిన్‌కు కలిగిన ఈ అభిప్రాయం వృద్ధి కావడానికి, స్థిరపడ్డానికి ఎంతచేయాలో, ఏంచేయాలో అంతా చేశాడు స్టాలిన్.

సైబీరియా కేంద్రాల్లో పరిస్థితులు దుర్భరంగా వున్నవి అనీ, అవి భూలోక నరకమని రొందరొచ్చి గోరిన్‌కుచెప్పారు. ఈ యమలోకాల్లో జరుగుతున్న అమానుషకృత్యాలనుగురించి ప్రబలంగావున్న వదంతులు అతనిచెవుల్లో ప్రతిధ్వనించిపోయినవి. "ఇవి వదంతులా, వార్తలా. ఈ ప్రచారంలో నిజం ఎంత వుంది?" ఈ విషయాల్ని స్వయంగా తెలుసుకోవాలనుకున్నాడు గోరిన్. స్టాలిన్‌కు కబురుపెట్టాడు. ఉత్తరాదిన తెల్లసముద్రంకాలవ త్రవ్వకం జరుగుతున్న ప్రాంతంలోవున్న శిబిరాలను చూచేందుకు గోరిన్‌కు అన్ని సౌకర్యాలను కల్పించారు.

శిబిరం సింహద్వారాన్ని దేవదారుచెట్టు ఆకులతో నేత్రానందంగా అలంకరించారు. గోరిన్‌కు స్వాగతం చెప్తూ శిబిరం అంతటా తోరణాలు కట్టారు. "మానవుని కంటె విలువైనది ప్రపంచంలో మరొకటి లేదు" అనే ప్రసిద్ధ గోరిన్ సూక్తిని పెద్ద పెద్ద అక్షరాలతో అట్టమీద వ్రాసి ఆ శిబిరంలో వేలాడదీశారు.

శిబిరంలోని రోడ్లు అన్నింటినీ బాగుచేశారు. ఇసుకతెచ్చి పోశారు. జైయిలు గదులకు వెల్లవేశారు. తలుపులకు రంగుపూశారు. అంతా పరిశుభ్రంగా వుంది. గోరిన్ మొదటి బారకాసులోకి వెళ్లాడు. అతనివెంట వొరొషిలావ్, ఇంకా అనేకమంది ప్రముఖులు వున్నారు. వారంతా ఏం చూచారు? ఖైదీలు అందరూ ఎంతో ఉల్లాసంగా వున్నారు. అందరూ సంతుష్టాంతరంగులై వున్నారు. ఉతకచేసిన దుస్తుల్లో, అక్కడి నిందితులు, ఖైదీలు, అందరూ చూసముచ్చటగా వున్నారు. కొందరు చదరంగం ఆడుతున్నారు. గ్రంథాలయంలోని గ్రంథాలు సరికొత్తవిగా వున్నవి. ఇవన్నీ ఇంత చక్కగా ఎలా వుండగలవని గోరిన్ అనుమానించనైనా లేదు. ఖైదీల దుస్తులు మల్లెపువ్వులాగా అంత తెల్లగా, రూపు చెరగక ఎలావుంటవి అని గోరిన్ విచారించలేదు. గ్రంథాలయంలోని గ్రంథాలు అంత కొత్తవిగా వుండడం ఎలా సంభవం అని గోరిన్ ప్రశ్నించుకోలేదు. ఈ సంస్కరణ శిబిరాలు అన్నివిధాలా ఆదర్శప్రాయంగా వున్నవని ఇట్టే నమ్మివేశాడు. గోరిన్ హృదయం అలాంటిది. అతన్ని నమ్మించడం చాలా సులభం!

ఘనతవహించిన అతిథుల గౌరవార్థం శిబిరంలోని ఖైదీలు వినోద ప్రదర్శనలు చేశారు. నృత్యప్రదర్శనతో వినోద కార్యక్రమం పూర్తి అయింది. గోరిన్‌కు ప్రీతిపాత్రము, అభిమానమైన అతని 'వోల్గా బోట్మన్' పాట ఎంతో శ్రావ్యంగా పాడారు. వాళ్ల ఉత్సాహం హద్దుమీరిపోయింది. ఆ అధికోత్సాహంలో వారు మైఖేల్ గోరిన్‌ను తమ శిబిరంలో గౌరవసభ్యునిగా చేర్చుకుంటామని కూడా ప్రకటించారు. సకాలంలో వొరొషిలావ్ కల్పించుకోక పోయినట్లయితే సోవియట్ సాహిత్యజనకుడు ఈ కాన్‌సెన్‌ట్రేషన్ క్యాంపులో 'గౌరవ ఖైదీ'గా వుండేవాడు!

(సశేషం)

## సంపాదకునకు లేఖలు

### యనమదుర్రు మురుగు కాలువ

ఆర్యా, పశ్చిమ గోదావరిజిల్లాలో యనమదుర్రు మురుగు కాలువకు ప్రతి సంవత్సరం వరదలు మామూలు అయిపోయాయి. 1900 సంవత్సరం వరదల తరువాత ఇంత ఉధృతమైన వరద గత 55 సంవత్సరాలలో ఎన్నడూ రాలేదు. ఈసారి వరదలవల్ల దువ్వవద్ద పడమటి గట్టుకు 150 అడుగుల మేర, తూర్పు గట్టుకు 100 అడుగులమేర గండ్లుపడి దాదాపు 20 వేల ఎకరాలు మునిగిపోయి పంట ధ్వంసమైంది.

ఈసారి వరద ఇంత ఉపద్రవం కలిగించడానికి కారణం పబ్లిక్ వర్క్సు శాఖ లోగడ, ఈ కాలువ గట్లను ఎత్తు చేయించినపుడు 1933 వ సంవత్సరపు వరదలనే అత్యధిక ప్రమాణంగా లెక్కలోకి తీసుకుని, ఆ అంచనాల ప్రకారం ఏర్పాట్లు చేయించడమే. 1900 సంవత్సరంలో వచ్చిన వరదలను దృష్టిలో ఉంచుకుంటే ఇంత ప్రమాదానికి అవకాశం ఉండేదికాదు. ఈ కాలవ ప్రవాహం సెకండుకు పదివేల ఘనపు టడుగులు (పదివేల క్యూసెక్కులు). ఏమేటా, ఈ ప్రవాహంవల్ల, ఒండ్రు మేట వేస్తున్నది. ఈ విషయాలన్నీ గమనించి, 1900 సంవత్సరపు వరదలను దృష్టిలో ఉంచుకొని, ఈ కాలవ గట్లను 5 అడుగులనుండి 8 అడుగుల వరకూ హెచ్చు చేయాలి.

ఏయేటా వచ్చిపడే ఈ వరదలను నివారించడానికి శాశ్వతమైన ఏర్పాట్లు చేయడానికి ప్రతి గ్రామంలో నూ యువకులను సమీకరించి వరద నివారణ దళాలను నెలకొల్పాలి. గట్ల కాపుదలకు బందోబస్తుకు చర్యలు తీసుకొనే నిమిత్తం కొంత సొమ్ము కేటాయించాలి. ప్రయాణికుల సౌకర్యానికై మూతపడిన గ్రామాల తరువాత రహదారి వంతెనలు కట్టించాలి. ఆయా గ్రామాల వద్ద జరిగే పనులను ఆయా గ్రామ పంచాయితీలకు లేదా వ్యక్తులకు ఒప్పగించి పనులు కట్టుదిట్టంగా జరిపించాలి. గ్రామాలవద్ద గట్ల మలుపులలో నీరు కోత కోయ్యకుండా, అడ్డుకోట్ల రాతి కట్టడాలు ఏర్పాటు చేయాలి. మురుగు కాలవలో వెంటనే ఒండ్రు తీయించాలి. వెంకయ్య కాలవగట్లు ఎత్తు చేయించి, కొంత నీటిని ఆ కాలవకు సర్దాలి. ఆయా గ్రామాలలోని బల్లకట్లు చెడిపోతే, మరమ్మతులకు ధవళేశ్వరం వెళ్లవలసి వస్తున్నది. అందువల్ల పెట్టి పేటలో మరమ్మతులకు ఏర్పాట్లు చేయించాలి. ప్రభుత్వం ఈ అంశాలను పరిశీలించి తగు చర్య తీసుకోగలరని ఆశిస్తున్నాను.

పెన్మత్సరాజు బాపిరాజు, మీనవిల్లూరు, (పశ్చిమ గోదావరిజిల్లా).

* * *

### పాఠ్యగ్రంథాల ప్రచురణ

ఆర్యా, ప్రభుత్వం, ప్రస్తుతం టీ. ఎస్. ఎల్. సి. ఇ. ఎస్. ఎల్. సి. పాఠ్య గ్రంథాలను స్వయంగా ప్రచురిస్తున్నది. ఈ పరీక్షలకు చదువువిద్యార్థుల సంఖ్య తక్కువే అయినప్పటికీ, 1956 వ సంవత్సరపు పాఠ్య గ్రంథాలను, ఆంధ్రప్రభుత్వం తమ ముద్రణాలయంలో అచ్చువేయడానికి వీలులేక మద్రాసుప్రభుత్వ ముద్రణాలయంలో అచ్చు వేయించవలసి వచ్చింది. ఈ పాటి పుస్తకాలే ముద్రించే సౌకర్యం లేని ప్రస్తుత పరిస్థితులలో ఆంధ్రప్రభుత్వం ఒకటి మొదలు పదవ తరగతివరకు కావలసిన పాఠ్యపుస్తకాలను లక్షల సంఖ్యలో ప్రచురించి రాష్ట్రంలోని పాఠశాలలన్నిటికీ సకాలంలో అందచేయడం సాధ్యపడే పనికాదు. ఈ పద్ధతి ఎంతవరకు ఆదరణ సాధ్యమో గోవిందరాజులు సంఘంవారు శ్రద్ధగా పరిశీలించాలని కోరుతున్నాను. అసలు కేంద్రీకరణ పద్ధతి, విద్యారంగమునకు శ్రేయస్కరమవునో కాదో. నిద్యా విధాన నిర్ణయం రాజకీ... లలో ఉండడం ఎ... నీయమోకూడా శ్రద్ధగ...

'విజ...

*

### జూకా మల్లె

ఆర్యా, ఆంధ్రపత్రికలో 4-9-55 నాడు కవిరాజు చిల్లరిగె వెంకటలక్ష్మీ నరసింహారావుగారు నిద్రలేమి నిపోగొట్టే జూకా మల్లెపువ్వును గురించి వ్రాశారు. ఈ పువ్వులు ఎండినవి, ఎండనివి ఎక్కడ లభించునో కూడా వ్రాస్తే బాగుండేది.

ఎమ్మిగనూరు, జె. యం. గంగన్న.

## హైద్రాబాద్ కార్మిక సలహా సంఘం

హైద్రాబాద్, సెప్టెంబరు 7: కార్మిక మంత్రి అధ్యక్షుడుగా 15 మంది సభ్యులతో హైద్రాబాద్ రాష్ట్ర ప్రభుత్వం కార్మిక సలహా సంఘాన్ని ఏర్పాటు చేశారు. ఈ 15 మందిలో 7 గురు ప్రభుత్వోద్యోగులుంటారు. మిగతా ఎనిమిదిమంది అనధికార సభ్యులలోనూ యజమానుల ప్రతినిధులు నలుగురూ, ఉద్యోగుల ప్రతినిధులు నలుగురూ ఉంటారు. ఈ సంఘం ప్రారంభోత్సవం ఈ నెల 28 వ తేదీ జరుగుతుంది. ఒక ఏడాది యీ సభ్యులు ఈ సంఘంలో వ్యవహరిస్తారు.



నందపురాలలో ఇళ్లు పడిపోయిన పేదలు తమ గోడు చెప్పుకుంటున్నారు.

# అనకాపల్లిలో మురుగు ప్రవహించదు!

## కిటకిటలాడే రోడ్లు: దోమల పుట్టినిళ్ల కలకల

(స్వకీయ విలేఖరి)

అనకాపల్లి, సెప్టెంబరు 5: విశాఖజిల్లాలో అనకాపల్లి పెద్ద వ్యాపార కేంద్రమైనా, ఇతర రాష్ట్రాలకు ఇక్కడనుంచి కోట్లాది రూపాయల బెల్లం ఎగుమతి అవుతున్నప్పటికీ పట్టణ ప్రజలు మాత్రం ఇంతవరకూ ఆరోగ్య సౌకర్యాలకు నోచుకొనలేదు. కొన్ని పేటలలో మురికినీళ్లు ఎటు పోవడానికీ వీలు కనిపించదు.

నిదానం దొడ్లలో మామూలు మురికి నీళ్లతో పాటు వాననీళ్లుకూడా నిలిచి పోతవి. ఎక్కడికక్కడ నీళ్ళు నిలచి ఇళ్లు కొలనులు తయారై దోమల ఆవాసాలు అభివృద్ధి చెందుతున్నవి. మళ్లవీధి సిమెంటు రోడ్డు మీదనుంచి అయినా నీళ్లు పోయే సౌకర్యం లేదు.

### ఇదుగో అదుగో అంటారు!!

ఈ పట్టణంలో మురుగునీటి కాలవల నిర్మాణం కోసం ఎన్నాళ్లిగానో ఆందోళన జరుగుతూన్నది. ఈ పథకం పేరున 1909 వ సంవత్సరం నుంచీ ఇంతవరకూ సుమారు రూ 2 లక్షలు వసూలుచేశారు ఇదుగో వస్తోంది మురికినీటి కాలవల నిర్మాణం...

### ఎగుమతి పన్ను విధించే అధికారం

### మద్రాసు వైద్యమండలి

## దొంగచాటు కమ్యూనిస్టులు

### బ్రిటిష్ కార్మికపక్షం భయం

లండన్, సెప్టెంబరు 5: జనీవాలో జరిగిన అగ్రరాజ్య నాయక సమావేశం వల్ల ప్రపంచం పరిస్థితులు బాగుపడిన ఫలితంగా ఆయా దేశాల కార్మికోద్యమాలలో కమ్యూనిస్టులు దొంగచాటుగా ప్రవేశించగల వీలేర్పడినట్లు బ్రిటిష్ కార్మికపక్షం భావిస్తున్నది. ఆ పక్షం తాలూకు ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షుడు చార్లెస్ గెడ్డిస్ నేడు ఇటువంటి హెచ్చరిక ఒకటి...

## పారిస్‌లో ఉత్తర ఆఫ్రికన్లపై దాడి

## చైనాలో ప్రభుత్వ వ్యతిరేకులకు శిక్షలు

## మహారాజుకు కె. ఐ. సింగ్ విజ్ఞప్తి

## మేనేజింగ్ ఏజంట్లు మారాలి

### కె. ఆర్. పి. ష్రాఫ్ సూచన

బొంబాయి, సెప్టెంబర్ 5: "దేశంలో మేనేజింగ్ ఏజంట్లు స్వయంగా తమ పరపతులను మార్చుకుని, పారిశ్రామిక నిర్వహణను శాస్త్రీయ పద్ధతిలో నడిపించాలి" అని బొంబాయి వాటాదార్ల సంఘం ఉపాధ్యక్షుడు కె. ఆర్. పి. ష్రాఫ్ గారు నేడు సంఘం వార్షిక సమావేశంలో మాట్లాడుతూ హెచ్చరించారు.

"పారిశ్రామిక నిర్వహణలో సాంకేతిక ప్రవీణులకు వ్యాపారస్థులతో పాటు భాగం ఉండాలి. మేనేజింగ్ ఏజంట్ల పద్ధతికి ప్రభుత్వం కొత్త అయినప్పుడు పాసింది కనుక, ఎనకటి పద్ధతిలో కుటుంబ వ్యవహారాలుగా పారిశ్రామిక నిర్వహణను ఉంచకుండా, సుశిక్షితులయిన కొత్త యువకులను తీసుకొని వ్యవస్థను అభివృద్ధిపరచవలసిన బాధ్యత ఉన్నది" అని ఆయన ఉపోద్ఘాటించారు.

మేనేజింగ్ ఏజంట్లు లేకుండా కొన్ని కంపెనీలు దేశంలో విస్తరించుతున్నందుకు ఆయన హర్షాన్ని వెల్లడించారు.

## వ్యవసాయానికి ఆర్థిక సహాయక సంస్థ

### ఏర్పరచడం లేదని కేంద్ర మంత్రి ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 6: వ్యవసాయ...

## శ్రీమతి కృపలానీ ఎన్నికల దావా

## దక్షిణాఫ్రికా భారతీయ సమస్యపై సమితిచర్చ

## జమీందారీ రద్దు పరిహారం బాండ్లు

## బ్రిటిష్ కౌన్సిల్ విద్యార్థి వేతనాలు

# ఆంధ్రలో మరి ఆరు అభివృద్ధి కేంద్రాలు

## గాంధీ జయంతినాడు ప్రారంభం

కర్నూలు, సెప్టెంబరు 6: అక్టోబరు 2 వ తేదీ గాంధీ జయంతినాడు ఆంధ్రలో మరి ఆరు జాతీయ వికాస కార్యక్రమ కేంద్రాలకు ప్రారంభోత్సవం జరుగుతుంది. కీటితో కలిపి రాష్ట్రంలో మొత్తం 22 కేంద్రాలలో జాతీయ వికాస కార్యక్రమాలు అమలు జరుగుతున్న మాట.

ఆంధ్రలో మొత్తం 27 జాతీయ వికాస కార్యక్రమ కేంద్రాలను మొదట నెలకొల్పారు. కాని, వాటిలో 11 కేంద్రాలను సమాజ వికాస కార్యక్రమ కేంద్రాలుగా ఆ తరువాత మార్చారు.

మొత్తంమీద అక్టోబరు 2 వ తేదీ నుంచి రాష్ట్రంలో సమాజ వికాస కార్యక్రమ కేంద్రాలలోనూ, 18 సమాజ వికాసాభివృద్ధి కేంద్రాలలోనూ, 22 జాతీయ వికాస కార్యక్రమ కేంద్రాలలోనూ అభివృద్ధి కార్యక్రమాలు అమలు జరుగుతవి.

కొత్తగా ఏర్పాటుకానున్న జాతీయ వికాస కార్యక్రమ కేంద్రాలలో మూడింటిని కర్నూలుజిల్లా ఆదోనితాలూకాలోని తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతంలోనూ, గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలో ఒకటి, అనంతపురంజిల్లా కదరి తాలూకాలో ఒకటి, కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకాలో ఒకటి నెలకొల్పుతారు.

### పట్టణాల్లోని వార్డుల పునర్విభజన

### వెనుకబడిన తెగలకు కార్యవర్గం

### రాజభవనం వార్తలు

### నజీర్ కు సోవియట్ దేశాల ఆహ్వానం

### అక్టోబరుకు భూసంస్కరణల సంఘ నివేదిక సిద్ధం

### సాంఘిక సేవా మహాసభ

## నూతనపద్ధతుల్లో ఇంగ్లీషుబోధన

### రేపల్లెతాలూకా ప్రధానోపాధ్యాయుల నిర్ణయం

రేపల్లె, సెప్టెంబరు 5: ఈ తాలూకాలోని ఉన్నతపాఠశాలల ప్రధానోపాధ్యాయులు మొన్న ఆదివారంనాడు గుంటూరు దక్షిణమండల విద్యాశాఖాధికారి ఆర్. మోహనరెడ్డిగారి అధ్యక్షతన సమావేశమై, 4, 5, ఫారములలో క్రొత్తపద్ధతుల్లో ఇంగ్లీషుబోధనవిషయం చర్చించాలని యింగుకోసం, అక్టోబరు నెలాఖరులోగా, తాలూకాలో ఉన్నత పాఠశాలలో, 4, 5, ఫారముల ఇంగ్లీషు భాష బోధించు ఉపాధ్యాయుల సమావేశం ఒకటి యేర్పాటు చేయాలని తీర్మానించారు.

జిల్లాలోని అన్ని పాఠశాలల్లోనూ, క్రొత్తగా ప్రవేశమునకు వచ్చే విద్యార్థులకు ఒకేసారి పరీక్షలు యేర్పాటుచేయడానికి నిశ్చయించారు.

సంఘకార్యదర్శి వందనాలతో సభ ముగిసింది.

## కన్నడ సేవాసమితి వార్షికోత్సవం

విజయవాడ, సెప్టెంబరు 4: ఈపట్టణంలోని కన్నడ సేవాసమితి ద్వితీయ వార్షికోత్సవం నేటి ఉదయం జరిగింది. విజయవాడ రేడియో కేంద్రం సహాయ డైరెక్టరు అధ్యక్షత వహించారు. సంఘాధ్యక్షుడు శెట్టా శెట్ గారు సభికులకు స్వాగతం చెప్పారు. కార్యదర్శి సి. ఎన్. నాగ్ గారు వార్షిక నివేదిక సమర్పించారు. కొత్త సంవత్సరానికి ఈదిగువ కార్యవర్గం ఎన్నికైనారు: అధ్యక్షుడు: శ్రీ శెట్టో శెట్, ఉపాధ్యక్షులు శ్రీ పి. ఆర్. శాస్త్రి, కె. నారాయణరావుగారలు, కార్యదర్శులు శ్రీ పి. ఎన్. నాగ్, పి. మాగవరావుగారలు కోశాధికారి, శ్రీ హెచ్. టి. వాసుదేవరావు, సభ్యులు: శ్రీయుతులు డి. కృష్ణమూర్తి, పి. వి. ఆచార్, ఎం. సుందరశెట్టి, హెస్కాట్, సి. వి. శాబురావు, రఘురామారావు, ఎం. ఎస్. రావుగారలు, డి. కృష్ణమూర్తిగారి వందనాలతో సభముగిసింది.

## శాశ్వత వరద నివారణ ఏర్పాట్లు

రాజమండ్రి, సెప్టెం 5: ఏటేటా గోదావరి వరదలవల్ల రాజమండ్రి పట్టణానికి, పరిసర ప్రాంతాలకూ వాటిల్లే నష్టం నివారించడానికి, ఇక్కడ శాశ్వతమైన కట్టుదిట్టాలు చేయించాలనీ, ఇందుకు సంబంధించిన నిర్మాణ కార్యక్రమాలకు, కేంద్రప్రభుత్వం ఏర్పాటు చేసిన వరదనివారణ నిధినుండి సహాయం తీసుకోవాలనీ ఆంధ్రప్రభుత్వాన్ని కోరుతూ స్థానిక రోటరీక్లబ్ వారు ఒక తీర్మానం చేశారు.

# రచ్చమరిసుగూరు గ్రామస్థులు వేరేచోట ఇళ్లు కొనాలి

## వరదల ఫలితం: స్థానికప్రముఖులభూదానం

## చిత్తూరు జిల్లా నిర్వివాద ప్రాంతం

### ఆంధ్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి

తడ, సెప్టెంబరు 5: ఆంధ్ర, మద్రాసు రాష్ట్రాల సరిహద్దు సమస్యలపై సంప్రతింపులు జరపడానికి ముందుగా, ఆంధ్రప్రభుత్వం, సరిహద్దుప్రాంతాలలోని అనుభవజ్ఞుల సలహాలు తీసుకోవాలనీ, ఆంధ్రరాష్ట్ర దక్షిణసరిహద్దుసంఘం సమర్పించినవినతిపత్రాలు, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు ఫజలాలీ కమిషన్‌కు సమర్పించిన వినతిపత్రం మొదలైనవన్నీ సమగ్రంగా పరిశీలించి, వాటిలోని అంశాలను దృష్టిలోఉంచుకొని, ఆపైన మద్రాసుప్రభుత్వంతో సంప్రతింపులు ప్రారంభించాలనీకోరుతూఆంధ్రరాష్ట్ర దక్షిణసరిహద్దుసంఘం(చెంగల్పట్ జిల్లా ప్రాంతాలు) అధ్యక్షుడు ఇ. వేణుగోపాలరెడ్డిగారు ఒక ప్రకటనచేశారు. ఈ ప్రకటనలో ఈయన ఇలా వివరించారు:

భాషారాష్ట్ర సూత్రాలననుసరించి, చిరకాలంగా ఆంధ్రులు కోరుతున్న ఆంధ్రరాష్ట్రాన్ని, నిర్వివాదప్రాంతాలతో కేంద్రప్రభుత్వం ఏర్పాటుచేసింది. అయితే ఈ నూతనరాష్ట్రము అసంపూర్ణమైనది. ఇంకా కొన్ని లక్షలమంది ఆంధ్రప్రజలున్న అంధ్రప్రాంతాలు స్వరాష్ట్రంలో చేరవలసివుంది. కేంద్రప్రభుత్వం చిత్తూరు జిల్లాను నిర్వివాదప్రాంతంగా పరిగణించి, అరంభంలోనే దానిని ఆంధ్రలో చేర్చింది. అయినా, శ్రీ వినాయకం, శివజ్ఞానగ్రామణి మొదలైనవారు కొందరు యీ జిల్లాలోని కొన్నిప్రాంతాలకోసం ఆందోళన మొదలుపెట్టి తెలుగు తమిళప్రజల ఐకమత్యాన్ని భగ్నంచేయ చూస్తున్నారు. సత్యాగ్రహం చేస్తామని బెదిరిస్తున్నారు. ప్రభుత్వాలమధ్య సంప్రతింపులు జరుగుతున్న యీ సమయాలలో యీఆందోళన హానికరమని గుర్తించాలి. వీరి నినాదాలు బెదిరింపులు ఎలావున్నా, ఆంధ్ర, మద్రాసు,కేంద్రప్రభుత్వాలు న్యాయానికి కట్టుబడి, సిద్ధాంతములకు విరుద్ధం కాకుండా వ్యవహరించి, ఈ సమస్యలను సామరస్యంతో పరిష్కరించగలరని ఆశిస్తున్నాము.

### చెంగల్పట్టుసేలంజిల్లాలు

కాగా ఆంధ్రరాష్ట్ర దక్షిణ సరిహద్దులో పొన్నేరి, తిరువళ్ళూరు, అరక్కోణం, గుడియాత్తం, హోసూరు, కృష్ణగిరి తాలూకాలలోని సుమారు 700 తెలుగుగ్రామాలలో నాలుగులక్షలమంది తెలుగువారున్నారు. వీరంతా ఆంధ్ర రాష్ట్రంలో చేరిపోవాలని ఆతృతతో ఉన్నారు. ఇందుకై సత్యాగ్రహం చేయడానికి వేలకువేలు సిద్ధంగా ఉన్నారు. అయితే ప్రభుత్వాలు సంప్రతింపులు జరుపుతున్నప్పుడు, ఆందోళన చేయడం సమంజసం కాదు.

మద్రాసు రాష్ట్రంలో మంత్రులు, శాసన సభ్యులూ కూడా, ఈసరిహద్దు ప్రాంతాలను మద్రాసు రాష్ట్రంలో చేర్చడానికి కృషిచేస్తున్నామని ప్రకటనలు చేస్తున్నారు. అనేకసార్లు ఆ శాసన సభలో ఈప్రసక్తి వచ్చింది. ఆంధ్ర ప్రభుత్వము శాసన సభ్యులూ ఈవిషయంలో శ్రద్ధ తీసుకోకుండా ముభావంగా ఉన్నారు. ఇది శోచనీయం. బళ్లారి మద్రాసుల విషయంలో...

## కానిస్టేబిల్ భార్య దుర్మరణం

### భద్రాచలంలో విషాద సంఘటన

Printed and Published for Nageswara Rao Estates Ltd. by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St., Madras-1. Editor, S. Sambhu Prasad.

## నెల్లూరుజిల్లా హైస్కూలు వేతనాలు

నెల్లూరు, సెప్టెంబరు 4: నెల్లూరి జిల్లాబోర్డు ఉన్నత పాఠశాలలలో విద్యార్థులు చెల్లించే వేతనాలు పెంచుతూ ప్రభుత్వం ఉత్తర్వులు ఇచ్చినందుకు నిరసన తెలుపుతూ, ఈ హెచ్చింపును రద్దు చేయాలని జిల్లా విద్యార్థి సంఘ కార్యకర్తలు విజ్ఞప్తిచేశారు.

ప్రత్తిపాటి వెంకటేశ్వర్లుగారి అధ్యక్షతన గతవారం జరిగిన ఈ సమావేశంలో, గత మూడు నెలలుగా ప్రభుత్వం వసూలుచేసిన అదనపు జీతాలు విద్యార్థులకు వాపసుచేయాలని కోరుతూ తీర్మానించారు.

ఖంసెవల్లి కృష్ణారావు గారు సమావేశాన్ని ప్రారంభిస్తూ ప్రజాస్వామిక దేశాలలో విద్యావిధానాల గురించి, విద్యార్థుల కర్తవ్యం గురించి ఉపన్యసించారు.

నెల్లూరుజిల్లా విద్యార్థిసంఘం 8 వ మహాసభను అక్టోబరు ఆఖరు వారంలో జరుపాలని ఈ సమావేశంలో తీర్మానించారు.